ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# అనుష్ఠానము.

సాకోరీ, శ్రీ ఉపాసనీబాబాగారి ప్రవచనము.


గీతా ప్రచారకులగు

శిష్టా సుబ్బారావు ఎం. ఏ. గారిచే

మరాటీ భాషనుండి ఆంధ్రీకరింపబడినది.



దివ్యవాణి పత్రికవారి శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సు

సికిందాబాదు.

1947.

# విషయసూచిక

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః



# అనుష్ఠానము

## 1 అవతారిక

శ్రీ ఉపాసనీబాబా గారు 1917-18 సంవత్సరములో అహమ్మదునగరు జిల్లా, కోపర్ గావ్ తాలూకాలోని సాకోరీ అను కుగ్రామమునకు వెలుపల శ్మశానములో ఆయూరి వాస్తవ్యుల ప్రార్థనమీద ఒక చిన్న జోపిడీ (కుటీరము) నిర్మింపించుకొని యందు నివసించుచుండిరి. తరువాత కొన్నాళ్ళకు అందొకమ్మీల ఒక పంజరము (పింజరా) తయారు చేయించుకొని 15 మాసముల పర్యంతము అందే తనను బంధించుకొని యుండిరి. వేనవేలు భక్తులు సర్వ సమయములందు బాబా దగ్గఱకు చేరుచుండిరి. వారి నుద్దేశించి బాబా ఎన్నియో ప్రవచనము లిచ్చియుండిరి. ఇట్టివానిలో నొకటియే మన యీ చిన్న పుస్తకమందలి విషయము. ఆ దినములలో మంగళమూర్తి యను నొక సన్యాసి సాకోరీలో ఉండెడివాడు. ఆయన గణపతి ఉపాసకుడు. తద్దేవతా ప్రీత్యర్థము రోజును ముద్గల పురాణము పారాయణ చేయుచుండెడివాడు. ఒకనాడాయన వాడుకచొప్పున జోపిడీ బయట కూర్చుండి పురాణము చదువుచుండగా వర్షము పడ నారంభించెను. నేల చెమ్మగిలుటచూచి బాబా మంగళమూర్తి స్వామితో నిట్లనిరి.

మున ఒకచోట కూర్చుంటిని. నన్నుజూచి మార్గస్థులు కొం దరు అక్కడచేరిరి. చుట్టుపక్కల వారందరును నన్ను ఒక పిచ్చివానిగను దిగంబరిగాను ఎరుగుదురు. ఉదయము ఎని మిది తొమ్మిది గంటలవేళ. బళ్ళమీద, సైకిళ్ళమీద, గుఱ్ఱ ములమీద, కాలినడకను ఎవరి పనులకువారు బోవుచుండిరి. నాడు అవిధవానవమి (భాద్రపద బహుళ నవమి). ఎండ బాగుగా కాయుచుండెను. వర్షచిహ్నము లేవియు లేవు. అక్కడ చేరినవారిలో స్కోరీనుండి శంకరపటేలు మొదలగువారేగాక గౌరవనీయులును మానవంతులు నగు పెద్దమనుష్యులుగూడ కొందరు గలరు. నేనేకాంతముగ నున్నప్పుడు నా మనోవృత్తి యిచ్చవచ్చినట్లు స్వేచ్ఛగా పోవుచుండినను వారందరును గుమిగూడినపిమ్మట వారిస్థితి ననుసరించి సంభాషణ ప్రారంభమాయెను. "మీరందరును షిరిడీకి పోవువారుకారా. మీ మీ పనులకుబోవక యేల వృథాగా ఇక్కడ కాలయాపన మొనర్తురు?" అని నే నంటిని. "లేదు బాబా! ఊరకె కొంచెముసేపు కూర్చుండి పోయెదము." అని వారనిరి. క్రమముగా జనసమూహము పెరుగజొచ్చెను. ఇరిగేషన్ పనికి సంబంధించినవారు నలుగు రైదుగురు అక్కడికి వచ్చిచేరిరి. వారిలో నొకడు గుఱ్ఱము మీదను మరొకడు సైకిలుమీదను నుండిరి. వారు తమ వాహనములను ఒకప్రక్కన నిలిపి క్రింద చతికిలబడిరి. "ఎండ తగులుచున్నది. మీపనికిపోక యిక్కడేల వృథాగా కూర్చుండెదరు" అని నేను హెచ్చరించితిని. "కొంచెముసే

నము; అను = వెంబడి, స్థానము = స్థలము, ధామము, పదవి) ఏ స్థానము పొందుటకుగాని, లేదా ఏ స్థానము పొందబడనిదనిగాని; తత్తుల్యమగు ఏ స్థానమును మనము కల్పించుకొందుమో అదియే యనుష్ఠానము.

వేదాంతులు, ఆధ్యాత్మిక మార్గమున మెలగువారు, సంసారమందు విసిగి వేసారినవారు, చరాచర సృష్టి అంతయు ఏందుండి వెలువడినదో ఆ మూలస్థానమునకు పోవుటకుగాని; లేదా అది ప్రాప్తించుట లేదనిగాని ఆ స్థానముయొక్క ఏ గుణధర్మములు శాస్త్రములచేగాని తత్వవేత్తలచేగాని ప్రకటము చేయబడినవో ఆ గుణధర్మముల ననుసరించి తామొక నవీనస్థానము నిర్మించుకొని, యీ నవీన నిర్మితస్థానమున మూలస్థానముయొక్క వర్ణనా ప్రమాణమున దాని సంబంధమైన యనుభవములు పొందుటకు ఏ యే కర్మలు నిర్వర్తింతురో ఆ యా కర్మలను అనుష్ఠాన మననగును.

వలసిన వస్తువు దొరికినను, అప్రయత్నముగ సహజరీతిని దొరకుచున్నను మేలే. అట్లుకానిచో బలాత్కారముగా దాని గుణధర్మములు మనయం దారోపించుకొని దాని యనుభవము కలిగించుకొనుటకు పిచ్చెత్తినట్లు ఒకవిధమైన ఉత్కంఠ మనస్సునకలుగును! ఈయనుష్ఠాన శబ్దార్థము ఎంత వరకు సమంజసముగా నున్నదో చూతము.

శ్రీకృష్ణ పరమాత్మయొక్కయు రాధ మొదలగు గోపికలయొక్కయు ఉదంతము ఇందుల కుదాహరణగా

నెంతయు నొప్పియున్నది. గోపిక లెప్పుడును కృష్ణునియందు సోత్కంఠలై పిచ్చిపట్టినవారివలె నుండియుండిరి. ఉన్న ట్లుండి ఒకనాడు కృష్ణుడు వారి నడుమనుండి హఠాత్తుగా మాయమయ్యెను. గోపికల కేమియును పాలుపోకుండెను. పైన చెప్పినప్రకార మేదైన నిష్టవస్తువు లభింపనిచో ఆ వస్తు లక్షణములు మనయందు లేకున్నను మనసున తీవ్రేచ్ఛ యున్నచో బలిమిని ఆ వస్తులక్షణములు మనయం దారో పించుకొని దాని యనుభవము పొందుదుము. అట్లే కృష్ణునికై ఆతురులైన రాధ మొదలగు గోపికలు తమకు కృష్ణప్రాప్తి లేకుండుటను, తమయందాతని గుణధర్మములు లేకుండుటను గ్రహించి బలాత్కారముగా నతని వేషభాషలను, గుణగణ ములను తమయం దారోపించుకొనిరి. అనగా వారు స్త్రీ లయ్యును శ్రీకృష్ణుని వేషము ధరించి అతని గుణగణముల ననుకరించి తద్రూపము నొందిరి. కాబట్టి మనము శ్రీకృష్ణుని సద్రూపము పొందవలసినచో యాతని సేవజేయుట, ధ్యాన మొనర్చుట, అతని గుణ శీలములను మన మలవరచుకొనుట మొదలగు ఏ యే కర్మలొనర్చినచో మనకు తెల్లమగు భగ వంతుని గుణసంపద మనకబ్బునో ఆ యా కర్మలన్నియు అనుష్ఠేయములు. గోపికలు తమ స్త్రీత్వమును మరచి శ్రీకృష్ణుని యద్భుత మహిమను, అఘటిత ఘటనాశక్తిని తమయం దనుభవించుటకై, అనగా తాము శ్రీకృష్ణులగుటకై తీవ్రప్రయత్నము లొనర్చి తమ భావబలముచే శ్రీకృష్ణ సద్రూపము నొందిరనుటకేయాక్షేపణయు లేదు. అట్లే అనుష్ఠాన

కాలమున మూలస్థాన గుణధర్మముల యొక్క యనుకరణచే తదవస్థయం దున్నట్లగును.

## 3 పరమేశ్వర ప్రాప్తికాలమున వ్యతిరేకావస్థయొక్క అనుభవము

పరమేశ్వరుడు సాకారుడును నిరాకారుడునుగూడ నగుటచే నతనియందు లింగభేదములు లేనూలేవు, స్త్రీ పురుషత్వములు కలనూకలవు. పరమేశ్వర ప్రాప్తి సమయమున స్త్రీ పురుషులకు వారున్నయావస్థకు వ్యతిరేకావస్థ అనుభవమునకు వచ్చును. స్త్రీ అయినచో పురుషుని యొక్కయు అనగా పరమపురుషుని యొక్కయు, పురుషుడయినచో స్త్రీ యొక్కయు అనగా ఆదిమాయ, ఆదిశక్తి యొక్కయు అవస్థానుభవము ఈశ్వరప్రాప్తి కాలమున కలుగును. ఇట్టి వ్యతిరేకావస్థానుభవము కలిగినపిమ్మట గాని పరమేశ్వరపదప్రాప్తి కలుగనేరదు. ఇది అనుభవైకవేద్యమైన యొక తాత్త్విక రహస్యము. ఈ విషయము కొంచెము గూఢమైనది. పరమేశ్వరస్థితి యిట్టిదట్టిదని తెలియరానిది. అంతర్ముఖులై తద్రహస్యము గ్రహించుట సంసారమందు పరిభ్రమించువారి కసాధ్యము.

పరమేశ్వరుడు ప్రత్యక్ష గోచరుడయ్యెను మొదటి నుండియు అతడు అదృశ్యుడు. గుప్తస్థితియం దుండువాడని భావించుచు జనులు మానవస్థితి ప్రత్యక్షమునియు పరమే

శ్వరస్థితి పరోక్షమనియు వాడుకలోనికి తెచ్చిరి. కాన యట్టి అదృష్ట పరమేశ్వరునిగూర్చి చేయు కర్మలన్నియు గోప్య నీయములని సంప్రదాయ మొకటేర్పడెను. పరమేశ్వరునితో సంబంధము జోడించుటకు ప్రయత్నించు సాధకులు గుప్తావస్థయందుండి తమతమ సాధనలను సాధింతురు. ఈ రహస్యము సాధకులకును యోగులకును బాగుగా తెలియును. లోకవ్యవహారమునందుండి బాహ్య దృష్టి మాత్రమే కల సంసారజనులకు దీనిమర్మ తెలిసినుకొనుట యసాధ్యము. బలవంతముగా కాకపోయినను మనము దేని ధ్యానము చేయుదుమో ఆ లక్ష్యముపై మనస్సు చాలాకాలము స్థిరముగా నిలిచినచో మనము దానివలె నగుదుము. ఇందుకుదాహరణము గోపికలు స్త్రీలయ్యును తమ స్త్రీత్వమును మరచి కృష్ణునియందు మనస్సు లగ్నముచేయుటచే తద్రూపమును పొందిరి. అదేప్రకారము పరమాత్మ ప్రత్యక్షమయినను మాయయొక్క ఆధారమున జగద్రూపమును ధరించి భాసించుచున్నాడు. జగత్తుయొక్క ప్రత్యక్షత్వమువలన పరమాత్మ అవ్యక్త గుప్తుడగుటచే యోగిజనులు తాము గుప్తావస్థయందుండుటకు యత్నింతురు. యోగులకును తత్వవేత్తలకును తద్విషయిక పూర్ణజ్ఞానము కలదు. వారు తమ యోగప్రభావముచే రాయి గడ్డిపోచ మొదలగు నేనయిన జడపదార్థములపై నెవ్వరైన నొక వ్యక్తిని ఆవాహనము చేసి వానితో సంభాషించగలరు. ఆ పురుషుడెంత దూరమున నున్నను వారి భావములన్నియు నా వ్యక్తి హృదయ

మున స్ఫురించును. కాని యెవ్వరివలన నీ స్ఫురణము కలుగు చున్నదో ఆ వ్యక్తికి తెలియదు. ఇట్లే యెవ్వరైనను ఇష్ట వస్తు ప్రాప్తికికాని పరమేశ్వర ప్రాప్తికికాని యత్నించినచో సాధింపవచ్చును. పరమేశ్వరునకు స్త్రీ పురుష రూపములు రెండును కలవుగాన యేరూపమునైనను అతనిని సాధింపనగును.

## 4 పతిప్రేమవలన పరమేశ్వర ప్రాప్తి

ఎవ్వరికైనను ప్రియపత్నీ వియోగము కలిగినచో ఆమెయందు మనస్సు లగ్నమయి పిచ్చిపట్టినవానివలె ఆమెనే ధ్యానించుచుండినయెడల ఆమె లక్షణములన్నియు తనయందే ఆతని కనుభవమునకు వచ్చును. ఆ స్త్రీ ప్రత్యక్షముగా నెదుట కనుపించకపోయినను ఆమె గుణ ధర్మములన్నియు తనయందే వచ్చియుండుటచే తన పురుషత్వమును మరచి తానే ఆ స్త్రీ అయినట్లనుభవము కలుగును. అట్లే స్త్రీకిని తనయొక్క పతిదర్శన మయితీరును. స్త్రీ జీవితకాలమున పతిప్రేమకు పాత్రురాలై పతియే దైవమని యెంచి ప్రేమించి సేవించినచో ఆమె పతిమరణానంతరము ఆమెకు పరమేశ్వర సంబంధమయిన అద్భుత శక్తియుతుడై ప్రసన్నుడగును. ఆ స్త్రీ పురుషులు పరమేశ్వర స్థితియందు లీనమగుదురు. వారి యానందమునకు మేరయుండదు. కావుననే భార్యాభర్తలు అన్యోన్య ప్రేమగలవారై

యుండవలెనని శాస్త్రములందు తత్వవేత్తలు నుడివిరి. ప్రస్తుత దేశకాల పరిస్థితులనుబట్టి దంపతులయవస్థ వ్యత్యయముగా నున్నది. ఈశ్వర ప్రేమతత్వము పూర్తిగా నదుగంటి వ్యావహారిక ప్రేమమాత్రము సమయానుకూలముగా నెంత యవసరమో అంతే మిగిలియున్నది.

## 5 ఒక స్వానుభవము

"అనుష్ఠాన మననేమి? బురదలో కూర్చుండుటవలన ప్రయోజనమేమి?" ఈ విషయమును స్పష్టపరచవలెను.

"రోజును మీరు కూర్చుండుచోటు బురదనైయి కూర్చుండుటకు మీకు అనుకూలముగా లేనిచో లోనికివచ్చి కూర్చుండుడు." అని బాబా పలుకగా అందరును జోపిడీ లోనికి పోయిరి. పిమ్మట బాబా ఇట్లు చెప్పసాగెను. "నేను ఇంతవరకు చెప్పుచున్నది మీరు శ్రద్ధగా వినుచుండినచో లోపలికి వచ్చియుందురు. సులువైనమార్గ మనుసరించుటలో ఆజ్ఞాపాలనము వెంటనే చేయుదురు. కాని బయటికు పొమ్మనినచో కష్టముతోచునుగదా. మీకు నేను ఎంత కఠినుడను దొరికితిని." ఈపలుకులు వినగనే లోనివారందరును తిరిగి బయటికి పోయిరి.

"పూర్వము నేను షిరిడీనుంచి రహాతాకును, రహాతానుంచి షిరిడీకిని రోజును వచ్చుచు పోవుచు ఉండెడివాడను. వాడుకచొప్పున ఒకనాడు రహాతాకు వచ్చుచు మార్గమధ్య

మున ఒకచోట కూర్చుంటిని. నన్నుజూచి మార్గస్థులు కొం
దరు అక్కడచేరిరి. చుట్టుపక్కల వారందరును నన్ను ఒక
పిచ్చివానిగను దిగంబరిగాను ఎరుగుదురు. ఉదయము ఎని
మిది తొమ్మిది గంటలవేళ. బళ్ళమీద, సైకిళ్ళమీద, గుఱ్ఱ
ములమీద, కాలినడకను ఎవరి పనులకువారు బోవుచుండిరి.
నాడు అవిధవానవమి (భాద్రపద బహుళ నవమి). ఎండ
బాగుగా కాయుచుండెను. వర్షచిహ్నము లేవియు లేవు.
అక్కడ చేరినవారిలో సాకోరీనుండి శంకరపటేలు
మొదలగువారేగాక గౌరవనీయులును మానవంతులు నగు
పెద్దమనుష్యులుగూడ కొందరు గలరు. నేనేకాంతముగ
నున్నప్పుడు నా మనోవృత్తి యిచ్చవచ్చినట్లు స్వేచ్ఛగా
పోవుచుండినను వారందరును గుమిగూడినపిమ్మట వారిస్థితి
ననుసరించి సంభాషణ ప్రారంభమాయెను. "మీరందరును
షిరిడీకి పోవువారుకారా. మీ మీ పనులకుబోవక యేల
వృథాగా ఇక్కడ కాలయాపన మొనర్తురు?" అని నే
నంటిని. "లేదు బాబా! ఊరకె కొంచెముసేపు కూర్చుండి
పోయెదము." అని వారనిరి. క్రమముగా జనసమూహము
పెరుగజొచ్చెను. ఇరిగేషన్ పనికి సంబంధించినవారు నలుగు
రైదుగురు అక్కడికి వచ్చిచేరిరి. వారిలో నొకడు గుఱ్ఱము
మీదను మరొకడు సైకిలుమీదను నుండిరి. వారు తమ
వాహనములను ఒకప్రక్కన నిలిపి క్రింద చతికిలబడిరి.
"ఎండ తగులుచున్నది. మీపనికిపోక యిక్కడేల వృథాగా
కూర్చుండెదరు" అని నేను హెచ్చరించితిని. "కొంచెముసే

ఫుండి పోయెదము. విశేషపుపని యేమియునులేదు'' అని వారు బదులుపలికిరి. వారిలో నొకడు ''నేడు నవమిగదా, యీనాడే నాభార్య మృతినొందెను.'' అనగా రెండవవాడు ''నేడు మా తల్లిగారి తిథి ఇంట వంటయగుచున్నది. తొందరేమియును లేదు.'' అనెను. ఇట్లు మాట్లాడుచుండగనే పన్నెండు ఒంటిగంటకూడ ఆయెను. అవిధవా నవమిగురించి నేను చెప్ప దొడంగితిని. ఆ ప్రసంగ మానందదాయకముగా నుండుటచేతను, తన భార్యకుగూడ సంబంధించిన దగుటచేతను మొదటివాడు తల్లీనుడై కూర్చుండెను. సుమారు రెండు గంటలయినను వారందరును ''మీరు లేచినగాని మేమును లేవ'' మని పట్టుదలతో కూర్చుండిరి. ఎండ తీవ్రముగా కాయుచుండెను. వర్ష చిహ్నము లేవియు లేవు. అయినను నేను ''వర్షము వచ్చును. మీకు శ్రమకలుగు'' నంటిని. ''మీరు లేచినగాని మేము లేవమని'' వారు భీష్మించుకొని కూర్చుండిరి. వారిలో కొందరు ముసలమానులు కూడ నుండిరి. వారు ''మీరు భగవత్స్వరూపులు. మీ రెక్కడ నుండిన నక్కడే యానందముగా ఉండు'' ననిరి. వారిలో మరొకడు ''వర్షమువచ్చిన మీరును తడియుదురు గదా'' అనెను. ''తడియుటకు నాకేమున్నది? మీ బట్టలు టోపీలు అన్నియు తడిసిపోవును. నేను సాయంకాలము వరకును ఇక్కడనే యుందును.'' అని పలికి ఆ నవమినాడు భార్యపోయినవానితో నిట్లంటిని. ''నీభార్య యింటికివచ్చి నీవు లేకుండుటచే వెడలిపోవునుగదా'' అతడిట్లు జవా

బిచ్చెను. "ఆమె యేల యింటికి పోవును. మీ వాగమృత పానమునకై యిక్కడికే వచ్చియుండును." ఇంతలో హఠాత్తుగా వర్షము ధారాపాతముగా కురియసాగెను. నేనట్లే కూర్చుంటిని. మిగిలినవారును కృతనిశ్చయు లగుటచే తడసి ముద్దయినను కదలలేదు. ఒకడు తనయొద్దనున్న ఛత్రమును వలదని వారించినను వినక నాకు పట్టసాగెను. నేనిందుల కియ్యకొననందున ఆతపత్రము లున్నవారుకూడ వాటి నుపయోగించుట మానిరి. దాదాపు నాలుగున్నర గంటల వరకును సంతతధారగా వర్షము కుమ్మరించుచుండెను. అయినను నిశ్చయ బలముచే నెవ్వరును లేవలేదు.

పూర్వము సాయిబాబా హారతియైన వెంటనే దుర్గాబాయి నాకొరకు నైవేద్యము తీసుకొని నే నెక్కడున్నను ఎండయనక వానయనక వెదకుచు వచ్చుచుండెడిది. ఆమె నాకు అన్నముపెట్టి తిరిగి షిరిడీకి పోవువరకు ఉపసించియుండెడిది. నేను మొదట కొన్నిదినములు ఖండోబా దేవళమం దుండెడివాడను. అనంతరము ఇటునటు తోచిన చోటకు తిరుగుచుంటిని. నేను ఎక్కడున్నను ఆమె నాకై వెదకుచు వచ్చి నేను తిన్నను, తినకపోయినను, తిట్టినను, కొట్టినను నైవేద్యము నాకు అర్పింపకుండ షిరిడీకి పోనట్టి కఠిన నియమమును పాలించుచుండెను. వాడుక ప్రకారము నేడామె సుమారు నాలుగున్నర గంటలకు నైవేద్యము తీసికొనివచ్చి నా వెనుక నిలిచెను. అప్పుడు శంకరపటేలో మధ్యాకరో "నైవేద్యము తీసికొని దుర్గాబాయమ్మ వచ్చిన

దని" నాకు చెప్పిరి. కొంతసేపయిన తరువాత "పాపము! వీరిని ఎంతసేపు కష్టపెట్టుట" అని నేను లేచి శంకరపటేలు చూపించిన ఒక కుటీరమందు అతని బలవంతముమీద దుర్గాబాయి తెచ్చిన అన్నము కొంచెము రుచిచూచితిని. దుర్గాబాయమ్మ తన నియమము ననుసరించి షిరిడీకి పోయెను. సాకోరా ఆశ్రమ మేమున ఆ జనులు వర్షమున తడియు నలవాటు లేనప్పటికిని నిశ్చయ బలముచే అంతసేపును బాహ్యాభావము లేక తన్మయులై కూర్చుండియుండిరి. కాన నది వారిపట్ల అనుష్ఠానమాయెను. మీరన్ననో నాలుగు వర్షపుచినుకులు మీద పడగనే మీ స్థానము వదలి లోనికి వచ్చితిరి. ఇందు మూలమున పూర్వ వృత్తాంతము స్మరణకు వచ్చినది.

## 6 అనుష్ఠాన విధానము

అనుష్ఠాన శబ్దమునకు ఏ అర్థము చెప్పబడినదో అట్టి స్థితికి ప్రయత్నము చేయునపుడు, అనగా అనుష్ఠాన మొనర్చునపుడు విఘ్నము లనేకము లుత్పన్నమగును. ఈ విఘ్నములను పాటింపక, విఘ్నములను భావనకూడ లేకుండ మూలస్థాన గుణధర్మమును సాధించుటకై అవిచ్ఛిన్నముగా ప్రయత్నము సాగించినచో అనుష్ఠానము పూర్ణతనొందును. నేడు ముద్గల పురాణ పారాయణమునకు ఈ వర్షము విఘ్నమాయెను. ఈ విఘ్నమును పాటించి మీ జాగాను వదలి మఱియొక మంచి స్థలమును చూచుకొని కూర్చున్నచో నేమియు

నుపయోగములేదు. మూలస్థానము స్థిరమైనది. దాని యందు కొంచెమైనను చలనముగాని, అసమాధానముగాని ఆనందమునత కించిత్తయినను వ్యత్యయముగాని లేదు.

ఆ గుణధర్మములు మనయందు సంక్రమించుటకై ఒక స్థలమును నియమించుకొని దానినెప్పుడు విడువకుండవల యును. గురుచరిత్రరామాయణము భాగవతము మొదలైన గ్రంథముల పారాయణ మొకవిధమగు అనుష్ఠానము. దాని క్రమమెట్టిదో నేను వివరించెదను. సాధ్యమైనచో ఆప్రకార మనుష్ఠింపుడు.

పిల్లవాడు ఏడ్చుచున్నాడని వానిపై దృష్టిపోని స్సుట లేక ఎవ్వరైనను డబ్బుతెచ్చినను, తపాలా బంట్రోతు ఇన్ స్యూరు తెచ్చినను మా న ము వీ డి 'కొంచెము ఆగుము ఇప్పుడే వచ్చుచున్నాను' అని గ్రంథములో ఏదైన ఆను వాలుపెట్టి అనుష్ఠానము వదలి వెళ్ళినచో అది నిష్ప్రయో జనము. అనుష్ఠానము మనఃపూర్వకముగా నొనరింప నిశ్చ యించుకొన్నచో అనుష్ఠాన శబ్దముయొక్క పైన వ్యక్త పరుపబడిన వ్యాఖ్యానప్రకారము మూలస్థానముయొక్క గుణధర్మములు మనయం దలవరచుకొనుటకు అనుకూలస్థల మొకటి ఏర్పాటు చేసికొని అది ఎప్పుడును విడువకుండ స్థిర ముగా నుంచుకొనవలయును. నియమితకాలమున ఆ నియ మిత స్థలమునకు పోయి కూర్చుండవలెను. ఇదివరలో ఏదైన ఆసన మభ్యసింపబడినచో అట్లు కూర్చుండుట మంచిది.

ఆసన నియమము మొదలైనవి హఠయోగమునకు జెందిన విషయములు. మీరు సంసారులు. సంసారములో నుండియే మీ పరివారముతోగూడ పరమేశ్వరావస్థయొక్క అనుభవము సాధింపవలసి యున్నది. కాన మీపరిస్థితుల ననుసరించి కొంతకాలమువరకు సుఖముగాను స్థిరముగాను కూర్చుండుట కనువగు నేదో యొక ఆసనము వేచుకొని కూర్చుండుడు. మూలస్థానముయొక్క గుణధర్మములు మనయం దారోపించు కొనుటకు చేయబడు క్రియ సత్క్రియ అనబడును. సంసారులైనవారుగూడ ఇరువదినాలుగు గంటలును లోక వ్యవహారమందే గడుపు నావశ్యకతలేదు. సత్క్రియాచరణమునందు గడుపుటకు వారు వీలువెంబడి ఉదయమో సాయంకాలమో రాత్రియో, రోజు మొత్తముమీద ఒకటి రెండు గంటలు దీనికై ప్రత్యేకించి ఉంచవలెను. ఆ కాలమున నియమిత ప్రదేశమున విధ్యుక్త ప్రకారము శుచియై కూర్చుండవలెను. మీ రందరును ఆయా వేళలందు నానా వస్తువులను, ద్రవ్యమును తెచ్చి నా కర్పణయని నా ముందుంచు వాడుక గలదు. ఆ వస్తువుల వలనగాని, ద్రవ్యమువలనగాని నాకేమియు ప్రయోజనము లేదు. నేను వాటికొరకు ఎవ్వరిని అడిగి యుండనులేదు. నేనెవరినైనను దేనికైనను అడుగవలసినచో అదియేదన 'దినమంతటిలో రెండుగంటలుగాని ఒకగంట గాని కనీసము పదునైదు నిమిషములైనను నాకిండు. నాకియ్య నిష్టములేనిచో భగవంతునకిండు.' నా కక్కరలేకున్నను మీరు నా కర్పించు వస్తువులను అన్నిటినిగాని, కొన్నిటిని

గాని మీరు తిరిగి పుచ్చుకొనుటగాని మీ ఉపయోగమునకై వాడుకొనుటగాని లేదుగదా. అట్లే ఇక్కడ నాలుగుగంటల లోను ఎప్పుడెంతకాలము నాకుగాని భగవంతునకుగాని యిచ్చివేసితిరో ఆ కాలమందు మీరీ లోకవ్యవహారము లేమియు చేయకుండ నుండవలయును.

ఇట్లు మన కాలములో కొంతభాగమును ఈశ్వరున కర్పించుటవలన పరిణామ మేదియో చూడుడు. మనమే దైనను వస్తువు ఈశ్వరార్పణ మొనర్చినచో దానిపై మన కేవిధమైన హక్కును ఎట్లు ఉండదో అట్లే భగవంతుని కియ్యబడిన కాలముపైగూడ మనకేవిధమైన హక్కును ఉండ నేరదు. అనగా ఆ కాలమందు మన సంసార సంబంధమైన గాని ఐహిక సుఖసంబంధమైనగాని ఏ వ్యాపారములు చేయ గూడదు. ఇంతియేగాక అట్టి మానసిక వ్యాపారముగూడ చేయకుండుట ఉత్తమము. కాని మనస్సునకు నానా విధము లైన మంచిచెడ్డల విచారణచేయుట అభ్యాస బలమున స్వభావమైనందున ఈశ్వరార్పితమైన వేళయందుకూడ శారీరకముగా లోకవ్యాపారములు బందైనను మానసిక విచారము నడచుచునే యుండును. ఎవరికి పరమేశ్వరార్పిత మైన వేళయందు మనస్సుచే గూడ లోకవ్యవహారము చేయ కూడదను నిశ్చయముకలదో వారనుష్ఠాన సమయమున మనసున ప్రాపంచిక విచారము పుట్టకుండుటకును; ఒకవేళ పుట్టినను తద్దోష పరిహారార్థమును, ఈశ్వర సంబంధమైన సత్కర్మ విడువకుండ నడపినచో మనస్సంచలనము క్రమ

క్రిమముగ నడంగును; లేదా కొంచెము చిత్తచలనమున్నను దానివలన దోషముండదు. ఈ తత్వము ననుసరించియే యేదైన ననుష్ఠానముగాని ఈశ్వర సంబంధమైన సత్కార్మ గాని నిర్వర్తించుటకు స్వతంత్రమైన ఒక స్థలమును, ఒక కాలమును ఏర్పాటు చేసుకొనవలయును చాలమంది యిండ్లలో పూజాగృహమని లేక దేవగృహమని ప్రత్యేకముగా నొకగది ఏర్పాటుచేయు వాడుక గలదు. భగవంతున కివ్వబడిన కాలమందు లౌకిక వ్యాపారములు చేయకుండుటే గాక ఆ సమయమందు సాంసారిక స్థలమందు గూడ కూర్చుండకూడదని పరమేశ్వరునికై నిర్దిష్టమగు స్థలమందు గూర్చుండుట యావశ్యకము. కనుకనే ఇంటియందు దేవగృహమను ప్రత్యేకస్థలము ఏర్పాటుచేయుట సంప్రదాయకమైనది. ఇట్టి పూజాగృహమందుగూడ ఘనకై రెండు మూడు మూరల స్థలము ప్రత్యేకముగా నుంచుకొనవలయును. ఆ కాలము, ఆ స్థలము మార్చగూడదు. నియమిత కాలమున శుచియై (అనగా మూలస్థానముయొక్క గుణధర్మమగు నిర్మలత్వ మనుకరించుచు) నియమిత స్థలమున కూర్చుండవలెను. అనుకూలమగు నేదైన ఆసనముపై సుఖముగాను స్థిరముగాను కూర్చుండి అత్యవసరమున్నగాని కదలక మెదలక అనుకున్న గ్రంథపఠనముగాని, జపముగాని, అభిషేకముగాని, ధ్యాన ధారణముగాని యే ప్రకారమైన సత్కార్మ నిశ్చయింపబడినదో అది నియమితకాలము పూర్తియగు నంతవరకు నిశ్చలముగా నొనర్పవలయును,

"బాబా! మనస్సు ఇటు నటు పరుగులు పెట్టును. దాని కేమి యుపాయ" మని మీ రడుగవచ్చును. మనస్సు ఇచ్చవచ్చినట్లు పోనిండు. మీ నియమమును మీరు పాలించినచాలును. సహజముగ జరుగునది ఏల మానును? మనస్సు పరిభ్రమించుచున్నను అది విఘ్నముగా నెంచక దానిపై లక్ష్యము పోనీయక అనుష్ఠానముమాత్రము సాగనిండు. మనోనిశ్చయము పూర్ణము కానంతవరకు విఘ్నములు వచ్చుచునే యుండును. విఘ్నములు వచ్చినను మన మేలునకే యని దానిని లక్ష్యముచేయక అనుష్ఠానము సాగించినచో ఆ విఘ్నముపోయి దానికన్న పెద్ద విఘ్నము రావచ్చును. అదియు గణింపనిచో నది శాంతించును. విఘ్నములకు జంకినచో అనుష్ఠానము వృథాయగును. అనుష్ఠానముయొక్కయు, మనోనిశ్చయముయొక్కయు భావార్థ మొక్కటియే. పూర్ణ నిశ్చయావస్థ లభించినచో ప్రాప్యవస్తువు పొందబడినదన్నమాట.

"నిశ్చయ బలమే దాని ఫలము. అని తుకారామ స్వామియొక్క వాక్యము."

నిశ్చయ బలముయొక్క అంత్య పరిణామముగా అమృతమయమగు ఫలము లభించును. జగత్సంబంధమైనది గాని, జగదతీతమైనగాని ఫలము నిశ్చయ బలముమీదనే ఆధారపడియున్నది. అనుష్ఠానము ఈ ఫలప్రాప్తికి సాధనమగు పూర్వక్రియ. అందువలన జాగరూకతతో (మెలకువగా) ఉండవలెను. అనుష్ఠానము పూర్ణమగుటకు అన్నగా

దేవుని కిష్టములేదు కాబోలు. కావుననే విఘ్నములు కల్పించు చున్నాడు. దేవుని యిచ్ఛలేనిదే మన యత్నములెట్లు కొనసాగును.'' అని కొందరు విఘ్నము కనిపించినంతమాత్ర మున అనుష్ఠానము ముగింతురు.

ఒక బ్రాహ్మణునిభార్య సంతాన హీనురాలుగా నుండెను. తులసీపూజ చేయమని నే నామెకు సలహా చెప్పి తిని. ''మాయింట తులసిపూజ అచ్చిరాలేదు. తులసీపూజ నేను మొదలుపెట్టిన కొలది దినములకు నాకున్న ఒక్క బిడ్డయు జారిపోయెను.'' అని యామె బదులు పలికెను. ఇట్టి భావనకలవారికి సత్కార్మాచరణ మెట్లు పొసగును? ఒక కుటుంబీకు డుండెను. ఆయన యింటికి శంకరుడొకనాడు మారువేషముతో వచ్చి భిక్షమడిగెను. గృహస్థు తన భార్యతో భిక్ష పెట్టుమనగా ఆమె యట్లుచేసెను. రాత్రి యామెబిడ్డ రోగగ్రస్తుడాయెను. రెండవరోజుకూడ శివుడు భిక్షకు వచ్చెను. ఆ సతి యాయనకు భిక్షమిడును. మూడవ రోజు శంకరుడు భిక్షమునకు వచ్చెను. ఆసమయమున వారింట పిల్లవాని శవమును బయట పెట్టిరి. అయినను భర్త భిక్ష వేయు నియమమును విడువవద్దని చెప్పుటచే నాల్గవదినము గూడ ఆమె భిక్షమిడెను. ఆ దంపతులు భిక్షమిడుట మన కచ్చిరాలేదనక విఘ్నములను గమనింపక భిక్షాక్రమమును సాగించిరి. కొన్నాళ్ళకు రెండవ పిల్లవాడును తరువాత మూడవవాడునుకూడ మరణించిరి. భిక్ష వేయుట మొదలు పెట్టినతరువాత పిల్లలందరు టప్ టప్‌న ఛావ నారంభించిరి.

మనోనిశ్చయము పరిపక్వమగుటకు విఘ్నములను లెక్క జేయక నియమము సాగించవలెను. తీవ్ర నిశ్చయము కలిగినా దానిని ఈశ్వరుడే కాపాడును. అటువైన విఘ్నములు రానేరావు; వచ్చినను మన మెదుర్కొని జయింపదగినవిగా నుండును. అట్లుగాక మన నిశ్చయబలము యొక్క పరీక్షకే అవి వచ్చినచో అవి చాల భయంకరముగ పరిణమించవచ్చును. అట్టి సంకట ప్రసంగమందుగూడ నిశ్చయమును వదలక సత్కర్మ నెరపినచో ఈశ్వరుడు ప్రసన్నుడగును. ఇట్టి పరీక్షనుండి సజీవముగా ఉత్తీర్ణమైనను గావచ్చును, లేదా నిర్జితులమై జీవమును గోల్పోవచ్చును. ఇంతకుమించి ఏమి కాగలదు. మన అనుష్ఠానమునకు ఇన్ని దినములు, ఇన్ని నెలలు, లేక ఇన్ని సంవత్సరములు అని మితియున్నచో ఈ గడువులోపుగనే ఇట్టి విఘ్నరూపమైన పరీక్ష నడచును. శరీరముండి జీవత్వము నశించినచో ఉత్తమమే. (ఇదియే జీవన్ముక్తి స్థితి) దేహవాసన నశించి శరీర పతనమైనను మేలే. (ఇది విదేహ ముక్తి) ఇదేమి అనుష్ఠానమని మీకు వింతలోచవచ్చును. కాని అనుష్ఠానము యొక్క ఉద్దేశ్యము ఉపాధిరహితమై, ఆనందస్వరూపమైన మూలస్థానమును పొందుటగదా. ఇది అనుష్ఠానము యొక్క మితి పూర్తి కాకుండగనే లభించినచో మన యత్నము సఫలమునొందినదిగదా. కాని మనలను మామూలు విఘ్నములుగా పరిగణించి అనుష్ఠానమును సాగింపనిచో అంతయు వ్యర్థమగును, "మావలన సేవచేయించుకొనుట

ఆయినను భిక్షవేయుట మంచిదికాదను తలంపుగూడ నా యాలుమగల మనస్సుల పుట్టనేలేదు. మీదుమిక్కిలి భర్త భార్యతో "ఎన్ని విఘ్నములు వచ్చిననురానీ, పిల్లలు పోయినపోనీ భిక్షవేయు వ్రతముమాత్రము విడువవద్దు" అనెను. క్రమక్రమముగా వారి నలుగురు పిల్లలును గతించిరి. తుదకు భార్యగూడ రోగపడి మరునాడు మృతినొందెను. ఆమె శవమును బయటపెట్టిరి. ఇంతలో బిచ్చగాడు వచ్చెను. నాడు ఇంకను వంటకాలేదు. బిచ్చమిడుటకింట నేమియు లేకుండెను. ఇంట నా గృహస్థుడొక్కడే యుండెను. అతడును భార్యయొక్క ఉత్తరక్రియల సన్నాహములో నుండెను. ప్రేత పిండప్రదానమునకై అన్నము వండబడెను. అప్పుడా గృహస్థుడు "నేడన్నము తయారుకాలేదు. ఏమి బిచ్చము పెట్టుదును" అనెను. ఆ తయారైన అన్నమునే పెట్టుమని బిచ్చగాడనెను. వల్లెయని ఆ గృహస్థుడట్లే చేసెను. ఇట్లెన్ని విఘ్నములు వచ్చినను ఆ గృహస్థు తన నియమమును మానక బిచ్చమిడుటచే తుదకాతడు కుటుంబ సహితముగా సర్వోత్కృష్టమైన కైలాసమునకు పోయెను.

## 7 ఇష్టదేవత ఎట్లు ప్రకటమగును.

మనకు జీవదశతో పనిలేదు. ఆ జీవదశ యున్నంత వరకు దుఃఖములు మనలను వెంటాడుచునే యుండును. కాన అనుష్ఠానమధ్యమున విఘ్నములు వచ్చినను లెక్కచేయక

మితి పర్యంత మనుష్ఠానము పట్టుదలతో సాగించినచో ఇష్ట దేవత ఆ ప్రదేశమందే ప్రత్యక్షమగును. ఇష్టదేవత రెండు విధములుగా ప్రకటమగును. 1. ఇష్టదేవత మన యెదుట నిలబడి ద్వైతభావములో అనుభవమునకు వచ్చును. కాని మొదట నిది స్థిరముగా నుండక మరల మరల అదృశ్యమగుచుండును. అయినను పట్టుదలతో సాధన కొనసాగించినచో తుద కనుష్ఠానము పూర్తియగుసరి కిష్టదేవత మనయెదుట ప్రత్యక్షముగా కూర్చుండుట, వలయు నుపదేశ మొనర్చుట మొదలగునవి యనుభవింప నగును. 2. 'ఇష్టదేవతయే నే' నను ఐక్యానుభవము కలుగ వచ్చును. మన దేహస్మృతి మరచి మన మేదేవతయొక్క ధ్యానము చేయుచుంటిమో ఆ దేవతయే మన' మను సోహం భావ ముత్పన్నమగును. మొదట నిదియు విచ్ఛిన్నముగనే యుండి పునః పునః దేహభావము కలుగుచుండును. ఇదియు నొక విఘ్నముగాన దీనిని గణింపక అనుష్ఠానమును పూర్ణత్వమునకు తెచ్చినచో నిష్టదేవతయే మనమయి ఆ దేవత యొక్క గుణధర్మము లన్నియు మనయందు ప్రకట మగును. మరల దేహభావము కలిగినను ఆ యనుభవమునుమాత్రము మరవక దాని ననుసరించు చునే యుండును. ఇట్టి సాధనకు గురువుయొక్క అవసరములేదు. సాధారణ జ్ఞానముగలవా రెవరైనను విశేష శ్రమ లేకయే తమంతట తాము అభ్యసింపవచ్చును. ముఖ్యాంశమేమన భగవద్దత్తమయిన కాల మందే యీ కృత్యము నెరపవలెను.

"మేము నవుకరిలో నుండు మనుష్యులము. ఇక్కడకు నక్కడకు పోవలసియుండును. మా కనుష్ఠానమెట్లు సాధ్య మగును." అని కొందరకు శంక కలుగవచ్చును. స్థలము పోయిన పోనిమ్ము. వేళమాత్రము పోకుండ చూచుకొనుడు. క్రొత్త స్థలమున నియమితకాలమున నిర్ణీతానుష్ఠాన మొన ర్చినచో మొదటి స్థలముయొక్క మహిమ యిక్కడకూడ దొరకును. స్థలము మన కలభ్యమయినను వేళమాత్రి మెచ్చటికిని పోదుకదా. "ఆవేళ సర్కారుపని తగిలినచో ఎట్లు" అని మరొక సందేహము కలుగవచ్చును. అదియొక విఘ్నమే. ఎన్నివిధముల నైనను యీశ్వరార్పిత కాలమున వేరొక వ్యాపారము చేయకుండ చూచుకొనవలెను. నిశ్చయ బలమున్నచో దైవముకూడ తోడగును. ఈ కాలనియమ తత్త్వముపై నాధారముచేసియే ద్విజులను ఉదయ సాయా హ్నములందు సంధ్యావందన మేర్పరుపబడెను. ముసల్మా నులు రైలుబండిలో నైనను వేళకు నమాజు చేయుదురు. వారెచ్చటకు పోయినను నమాజు వేళమాత్రము దాట నివ్వరు. ప్రాయికముగా భగవంతుడట్టి వేళయందు విఘ్న ములు లేకుండ చేయును. తప్పనిసరియై యనుష్ఠానమును మానవలసి వచ్చినచో అడ్డుతీరినవెంటనే సత్కర్మను తిరిగి సాగించవలెను. అట్లొనర్చినచో వృథాయయిన కాలము వలన దోషము కలుగకుండ భగవంతుము చూచుకొనును. కాని బద్ధకించి "నేడు విశ్రాంతి తీసికొందును, రేపు

చూచుకొనవచ్చును" అని యశ్రద్ధవహించినచో ప్రయోజనము లేదు.

## 8 మంచిభార్య భర్తను సన్మార్గమునకు త్రిప్పును

అనుష్ఠానము సక్రమముగా నిర్వర్తించుటలో భార్య శ్రద్ధవహించి సహకారిగా నున్నచో కార్యము సానుకూలమగును. ఇందులకు భార్య మంచిదిగా నుండవలెను. భార్యను ధర్మపత్ని, సహధర్మచారిణి యందురు. ఏ భార్య భర్తకు సత్కర్మాచరణమందు సహకారిగా నుండునో ఆమెయే ధర్మపత్ని, సహధర్మచారిణి యను నామముల కర్హురాలు. తనకు సహజముగ లేకున్నను ఇట్టి సతినిచూచి సిగ్గుపడియైనను భర్త సత్కర్మాచరణకు గడంగును.

భార్య పూజా ద్రవ్యాదికములు తయారుచేయుట, వడ్డించుట మొదలగు పద్ధతి ననుసరింప వలయును. మగడు మడికట్టుకొనినను, కట్టుకొనకపోయినను, సంధ్య వార్చినను వార్చకపోయినను భార్యమాత్రము నియమప్రకారము పీట వేసి మడిబట్టపెట్టి చెంబునీళ్ళు, పూజా ద్రవ్యములు వద్దైరాల నమర్చవలెను. అతడు "ఇవన్నియు నేమి తీసి వేయుము" అన్నచో తీసివేసి మరునాడు తిరిగి అట్లే పెట్టవలెను. అతడు "మరల ఇవన్నియు నేలపెట్టితివి" అనిన, "నా నియమముప్రకారము నే నొనర్చుచున్నాను. నా స్త్రీ ధర్మమునకు మీ రడ్డురావలదు. మీకు సంధ్యపూజ వద్దై

రాలు చేయకూడదన్న నియమమున్నచో చేయకుడు. మా తల్లిదండ్రులు నాకిట్లు బోధచేసిరి. కాన నేనట్లొనర్చుచున్నాను. నాకు మీరును దైవమే. తల్లిదండ్రులును దైవసములే. (మాతృదేవోభవ, పితృదేవోభవ) శాస్త్రములందు తల్లిదండ్రులును భర్తయుగూడ దైవముగనే చెప్పబడిరి. కాన నిద్దరి యాజ్ఞలుకూడ నాకు పాలనీయములే. ఇద్దరి యాజ్ఞలును వ్యతిరేకములయినచో వాట్ల పాలనయందు నాకు శ్రమకలుగును. అయినను నేను దానిని సహించుటకు సిద్ధముగనే యున్నాను. భర్త కొంచెము కోపగించినచో "నేను మీముందు పాదరక్షలు, ఆమేధ్యము మొదలగు అశుచి పదార్థము లేవయినా పెట్టితినా? ఈ సత్కర్మ యొక్క పరిణామము మీకును నాకును మాత్రమేగాక మన సంతతికిగూడ జెందునుగదా" అని యామె తన నియమమును పట్టుదలతో నడిపినచో యామె నిశ్చయముయొక్క పరిణామముగా నతడామె క్రమమున కడ్డురాకుండుట మొదట నలవరచుకొనును. మరికొంతకాలమునకు మడికట్టుకొనుట సంధ్యవార్చుట మొదలైనవి నెమ్మదిగా మొదలిడును. ఒకప్పుడెవ్వరైనను నవనాగరికుడై సూటు బూటులతో భుజించు మిత్రు డతిథిగా వచ్చినచో నతడాక్షేపణ పూర్వకముగా "ఇవన్నియు ఎప్పటినుంచి ప్రారంభించితివి" అని అడుగవచ్చును. మొదటివాడు "ఇదంతయు మా యింటి యామెయొక్క పిచ్చి" అని బదులు పలుకును. ఆ మిత్రుడు ఆడవారు వెఱ్ఱివేషములు చాల వేయుచుందురు" అని గేలి

చేసినచో మొదటివాడు భార్యతో "ఇవన్నియు వెంటనే తీసివేయుము. తొందరగా వడ్డించుము. అవసరముగా ఆఫీసుకు పోవలెను" అని చీకాకుపడును. భోజనమైనతరువాత మిత్రులు సిగరెట్లు కాల్చుకొని రెండుమూడు సార కాయలుకోసి, కళ్ళజోడు, టోపి వగైరాలు ధరించి కచేరీకి పోవుదురు. మొత్తముమీద ఆ స్త్రీయొక్క సత్కార్యాచరణ పరిణామము కొంచెముగానో గొప్పగానో కనిపించియే తీరును. కాలక్రమమున నతనికి స్నానసంధ్యాది కృత్యము లభ్యాసమగును.

మరొకప్పు డెప్పుడైనను అతనిమిత్రు డింటికివచ్చి 'యీ యాడంబరమంతయు యెప్పటినుండి' అని హేళన చేసినచో నతడు "పోనిమ్ము, ఇంతవరకును మనము పరమార్థ విషయమున కించిత్తును కృషిసల్పలేదు. మన పెద్దలు శ్రేయస్కరమనియే యీ పద్ధతులు తామనుసరించి మనకు సంక్రమింపజేసిరి. దానిని మనమేల యనుష్ఠింపగూడదు" అని ప్రత్యుత్తరమిచ్చును. ఇదంతయు నతని భార్యయొక్క నియమఫలము.

ఇంతియేగాక యాతని మిత్రుడు వీరియింటికి రాక పోకలు నెరపుచున్నచో నతని మనస్సుపైగూడ నీ సత్కార్యా చరణ పరిణామముకలిగి అతడు "నా భార్యగూడ వేళకు సరిగా పరికరములన్నియు సమకూర్చినచో నేనును స్నాన సంధ్యాదికములు చేయుచుండెదను. నా మిత్రుని భార్య యతని స్వభావవర్తినియై అన్నివిధము లనుకూలపడుచుండును"

అని తలంచి తనభార్యతో "ఏమే నీ తల్లిదండ్రులు మడి, పొచి, పూజ, దేవతార్చన మొదలగు విషయములేవియు బోధింపలేదా? నా మిత్రుని భార్యనుచూడు. ఆమె యతని కన్నివిధముల నెట్లుపచరించుచున్నదో" అనును.

"అట్టి సంస్కారములు మీకుమాత్రముండినవాయేమి? మా పుట్టింటివారిమాట యటుండనిండు. మీరేకదా నాకీ దురాచారము లన్నియు మప్పినది. ఇప్పుడెవ్వరినో చూచి నన్ను దెప్పిన ఏమిప్రయోజనము? ఈ అలవాట్లు నాకిప్పు డెట్లు పోవును." అని కొంచెము తీవ్రముగా జవాబిచ్చును. తన మిత్రుని యుదాహరణచూపి యీ గృహస్థు తన భార్యకు మంచి యలవాట్లు క్రమక్రమముగా నలవడ జేయును. వారిరువురును కొలదికాలముననే సన్మార్గమునకు వచ్చి శ్రేయము నొందుదురు.

మనోనిశ్చయ మున్నచో నెట్టి యాటంకములేక నిర్విఘ్నముగా అనుష్ఠానము కొనసాగును. ఎండయనక వానయనక నిరంతరము సత్కర్మాచరణయం దప్రమత్తుడై యుండవలెను. విఘ్నమనగా ప్రతికూలావస్థ. ఇదియే తుదకు అఖండ సుఖప్రాప్తికి హేతువగును. బురదగానుండి కూర్చుండుటకు శ్రమదోచినచో లోపలికివచ్చికూర్చుండుడని బాబా ఆహ్వానించినను ఎవ్వరును లోనికి రాలేరి.

## 9 చిత్తశుద్ధి కుపాయము

మూలస్థానముయొక్క గుణధర్మములు మనయందు ప్రకటమగుటకు ఒక నియమిత స్థలమున మౌనము ధరించి

పైన జెప్పబడిన ప్రకారము అనుష్ఠాన మొనరించినచో మన యింటనే మనకు పరమేశ్వరప్రాప్తి కలుగును. పరమేశ్వర లక్షణములు మనయందు లేకున్నను వాటినిగూర్చిన జ్ఞానము కలదుగాన బలాత్కారముగా నా గుణధర్మములు మనయం దారోపించుకొనవలెను. తగినంతకాల మిట్లొనర్చినచో ఆ స్థితి మనయందు స్థిరమై అనుష్ఠానము పూర్ణమగును. ఇదంతయు సహవాసముయొక్క పరిణామము.

ఇదివరకు పెక్కుమార్లు సద్గురుపు తడిమట్టి వంటి వాడని మీకు నుడివియుంటిని. కదలడు మెదలడు. ఎట్లు త్రిప్పిన నట్లు తిరుగును. జీవావస్థయు నిట్టిదే. మీరుకూడ తడిమట్టివలె పరిస్థితులనుబట్టి వలయునట్లు మార్పు జెందు దురు. ప్రస్తుతమీ రాంగ్లప్రభుత్వమునకు లోబడియుండు టచే వారి వేషభాషలను పద్ధతులను అనుకరించుచున్నారు. ఎవరితో సహవాసము చేసిన వారి గుణధర్మములు మన కబ్బను. (ఆరునెలలు సహవాసముచేసిన వారు వీరగుదురు) భ్రష్టుల సహవాసము చేసినచో వారి స్థితియే సంక్రమించును. కల్లుత్రాగువారి సహవాసముచేసినచో మనకును ఆ దురభ్యా సము పట్టుబడును.

తడిమట్టితో నొక గాడిద యాకారము తయారుజేసి యది నచ్చకరలేనిచో అదే మట్టితో ఒక గోవును జేయ వచ్చును. ఈ గోవునుమార్చి యొక దేవతస్వరూపమును చేయవచ్చును. ఇట్లే జీవాత్మలను కోరినప్రకారము మార్చ వచ్చును. భక్తి శ్రద్ధలులేని జీవుడు తీవ్రేచ్ఛవలన వాటిని

మనస్సున ఉత్పన్నము చేసుకొనవచ్చును. మట్టి యెండి పోయినచో దానిని శ్రమపడి నీళ్ళుపోసి తడిపి ముద్దగాజేసి పిమ్మట వలయు నాకారమును కల్పించవచ్చును. ఇదే ప్రకారము భక్తిశ్రద్ధలు బొత్తిగా లేని మనస్సునగూడ వివిధములగు చిత్తశుద్ధి ఉపాయములలో నేదో యొకటి యనుష్ఠించి కష్టించినచో భక్తి విశ్వాసము లుత్పన్నములు కాగలవు. ప్రాతదిపోయి క్రొత్తది వచ్చుటకుగాని, చెడ్డ పోయి మంచి వచ్చుటకుగాని కష్టపడవలసి యుండును. శ్రమకోర్చి తీవ్రయత్నము నిరంతరము సాగించినచో ఈ జన్మయందే కార్యసిద్ధియగును. లేదా ఒకటి రెండు జన్మలలో నైనను అయితీరును.

తడిమట్టివలెనే సువర్ణముగూడ వలయు వస్తురూప ముగా మారును. కాని ప్రథమమున సువర్ణముయొక్క కాఠిన్యముపోయి మృదుత్వమేర్పడుటకు అగ్నితప్తము చేయ వలెను. అట్లే జీవునియొక్క దుష్టసంస్కారములు (కాఠి న్యము) నశించి శ్రద్ధాభక్తులు (మృదుత్వము) కలుగుటకు చేయు వ్యాపారమే సత్క్రియ యనబడును.

## 10 సత్కర్మాచరణవేళ మనస్సు తిరుగాడిన తిరుగనిమ్ము

'సరిగా అనుష్ఠానములో కూర్చున్నప్పుడే మనస్సు పరిపరి విధముల తిరుగ నారంభించును. ఇక ననుష్ఠాన మెట్లు పొసగును' అని కొందరికి సందేహము కలుగవచ్చును.

మనస్సు తిరిగిన తిరుగనిండు. మీ స్వాధీనములో నున్న వాక్కాయములను మాత్రము అనుష్ఠానమందు స్థిరముగా నెలకొల్పుడు. పైన చెప్పబడిన భార్యాభర్తల యుదాహరణలో భర్త మొదట అవ్యవస్థ స్థితియందుండియు భార్య యొక్క నియమ మహిమవలన సన్మార్గమునకు మరలెను. మన మనస్సును శరీరమును పతీ పత్నులవంటివి. పత్ని యగు శరీరముయొక్క అనుష్ఠాన మహిమవలన పతియగు మనస్సుయొక్క చాంచల్యము నశించును. నియమిత కాలమున నియమితస్థలమున కూర్చుండి యేదైన నొక సద్గ్రంథ పారాయణముగాని మంత్రజపముగాని ధ్యాన ధారణాదికముగాని సక్రమముగా ననుష్ఠించినచో కొంతకాలమునకు మనస్సు సిగ్గుజెంది లేక విసుగుజెంది తుదకు మన స్వాధీనములోనికి వచ్చును. మూలస్థానముయొక్క గుణధర్మములు ఆ మనస్సున కలవడి అది ఆనందస్వరూప మగును. తిరుగుచున్న మనసువైపునకు లక్ష్యము పోనీయక యనుష్ఠానమును తీవ్రముగా సాగించినచో మనస్సు ఎక్కడికి పోగలదు? అది తడిమట్టి వంటిదని ఇదివరలో నేర్చుకొంటిమిగదా. దానిని ఎట్లు మార్చిన అట్లు మారును. మూలస్థానము యొక్క గుణధర్మములు మనయందు స్థిరపడినకొలది మనస్సుయొక్క భ్రమణ స్వభావము నశించును. కారణమేమన? మనస్సు స్వభావసిద్ధముగ చలించునదిగాదు. చలనస్థితి నది ఎరువు తెచ్చుకొన్నది. సహజమైన స్థితివలె అస్వాభావికమై ఎరువుగా తెచ్చుకొన్నస్థితి కడవరకు నిలచునదిగాదు. తద

వస్థ మనస్సునకు స్వాభావిక మగుటచే సత్క్రియాచరణ గూడ దానికి నైసర్గికమే. దానినుండి నిరోధించుటకు బ్రహ్మ దేవుని తాతకుగూడ సాధ్యముగాదు.

విఘ్నములను గణనచేయకుండుట మన స్వాధీనములో నున్న విషయము. మనసును తిరుగనిమ్ము. మనస్సు తిరుగు చున్నదిగదాయని అనుష్ఠానమును మానినచో యే అనుభవ మును కలుగనేరదు. శరీరము పట్టుదలతో అనుష్ఠానమును సాగించినచో కొంతకాలమునకు మనస్సు స్థిరమగును.

ఏదైన సత్కార్యముగాని నిష్కామబుద్ధితో నొక యనుష్ఠానమునుగాని ప్రారంభించినచో మనస్సు ఇటునటు తిరుగ నారంభించును. చాలమందియొక్క మనస్సు అను ష్ఠానకాలమున పలుచోట్లకు పరుగులిడుచు వారి యనుష్ఠాన మునకాటంకము కలుగజేయును. అట్టి యనుష్ఠానమువలన ఉపయోగమేమైన గలదా అని పెక్కండ్రు నన్నడుగుచుం డిరి. నా యభిప్రాయములో మనస్సు తిరుగుచుండుటవలన నష్టమేమియులేదు సరికదా ఎంత తిరిగిన అంత లాభము. 'శాస్త్రములందును, పురాణములందును సత్కర్మానుష్ఠాన వేళ మనస్సు ఇటు నటు పరిభ్రమించుట మంచిదిగాదని చెప్ప బడినదే. మీరిట్లు సెలవిచ్చెదరేల?'' అందురేమో శాస్త్ర వాక్యము సరికాదని నేననుటలేదు. కాని స్థిరచిత్తముతో సత్కర్మాచరణ సాధ్యముకానిచో అసలు మానుటకంటె అస్థిరచిత్తముతో నైనను సత్కర్మ నిర్వర్తించి లాభము నొందవలయును.

అనుష్ఠానకాలమున కర్తకు ద్వివిధమైన అనుభవము కలుగును. (1) మనస్సు స్థిరముగా నియమిత సత్కర్మాచరణము నిర్వర్తించుట, (2) మనస్సులో ఒకయంశ చంచలముగానుండి మంచిచెడ్డ భేదములేక నానా ప్రదేశములకు తిరుగాడుచుండుట. మనస్సొకటియే యయ్యును రెండువిధములు పనిచేయుచుండుట ప్రత్యక్షానుభవము. వీటియందు విరుద్ధభావమేమియు లేదు. మనస్సు స్వభావమెట్టిదనిన? అది శరీరముద్వారా నొక వ్యాపారము చేయుచు ఆ సమయముననే తాను మరొక వ్యాపారమునుగూడ చేయుచుండును. కాని దానివల్ల మొదటివ్యాపారమున కేమియు హానిలేదు. ఒకానొకవ్యక్తి నిష్కామబుద్ధితో పరమేశ్వర ప్రీత్యర్థము ఏదైన సత్కర్మానుష్ఠానమునకు గడంగినచో ముందాతడు ఈ అనుష్ఠాన విషయములన్నియు మానసికముగా నాలోచించి పిమ్మట కాయక, వాచక వ్యాపారములతోగూడ నది ప్రారంభించును. ఏదైన గ్రంథ పారాయణగాని, అభిషేకముగాని, జపముగాని, ధ్యానముగాని చేయవలసినచో స్థిరముగా నాసనముపై గూర్చుండి గ్రంథపఠన లేక మాల త్రిప్పుట, అభిషేకము చేయుట మొదలగు కాయక వాచక కర్మలకు తగినశక్తి (force) నిచ్చి మనస్సు ఇంక తనవ్యాపారము మొదలిడును. "తాపీవాడు (గవుండు) పాకీదొడ్డి కట్టుచున్నాడో లేదో, తట్టలు వచ్చినవో లేదో, పక్కవారి దొడ్డిలోనికి ఎన్నాళ్ళు పోయేది. మా దొడ్డిలోనికి రావద్దని అతడిదివరకే చాలసార్లు చెప్పినాడు. మన కహితుడైన

ఫలానవ్యక్తి మనపై కిట్టనిమాటలెన్నో కల్పించినను, వాటి నుండి మన నిర్దోషిత్వమెట్లు ఋజువు చేసుకొనవలెనో, ఏమి కర్తవ్యమో......వగైరా." ఇంటిలో ఎవరైనను రోగి యున్నచో "ఏ వైద్యుని పిలతును, ఏమిచేతును" అని గాని "తీరికూర్చుండి దుకాణము పెట్టితిని. లాభము వచ్చునా రాదా" అని యిట్లు లెక్కలేనన్ని తలంపులు మనసున ఉత్పన్నమగును. త్రాగుబోతెవ్వడైనను అనుష్ఠానమునకు కూర్చుండినచో అతని తలంపులు త్రాగుడుపై పోవుచుండును. "నేడు డోసు కొంచెము తక్కువైనది. సారాయి తెచ్చుటకు ఎవరిని పంపుదును? ఒక్క గంజాయిదమ్మును పీల్చినచో మనస్సు దేవునిపై చక్కగా లగ్నమగును. నాకు గంజాయి నెవరు తెచ్చియిత్తురు......వగైరా" ఇట్లొక వైపు పరమేశ్వర సత్కర్మయును మరొకవైపు నానాప్రకారముల మంచిచెడ్డ లౌకిక వ్యవహారములను మనస్సులో నడుచుచుండుట అందరికిని యనుభవములో నున్నదా లేదా? సత్కర్మ నిరాటంకముగా నడచుచుండు నంతవరకు మనస్సు తిరుగుచుండిన నేమిప్రమాదము. చిత్తచలనముపై దృష్టిని పోనీయక సత్కర్మ అవిచ్ఛిన్నముగ నెరవేర్చుటయే మన కర్తవ్యము.

అనుష్ఠాన మెందులకు? దానియందు మలినపదార్థమును స్వచ్ఛముచేయు గుణముగలదు. అపరిశుభ్ర మనస్సును శుద్ధిచేయుటకును అనగా సవవస్థకు దెచ్చుటకు ఆ యశుద్ధమనస్సు ఏయే స్థలములకు తిరిగి వాటి నపవిత్రము

చేయునో వాటి నన్నిటిని పవిత్రముచేసి తద్వారా తాను పరిశుద్ధినొందుటకు మనస్సు అనుష్ఠానమును ప్రారంభించి పుణ్యశక్తిని ఉత్పన్నముచేసి ఆ శక్తితోకూడ తానాయా స్థలమునకు పోవుచుండును.

మనస్సు ఏ స్థలమందు తిరుగాడుచుండును? ఏ యే స్థలముల నిదివరకు తా నెఱుగునో ఆ స్థలములకే పోవును. ఎన్నడును, కని, విని, యెరుగని చోట్లకుగాని ఏదో విధముగా తన కెరుకలేని స్థానములకుగాని మనస్సు పోనేరదు. సింహమును చూడకగాని, దానినిగుఱించి యేమియు తెలియకగాని యుండినచో సింహమునుగూర్చిన యాలోచనలు మనసున నెన్నడును పుట్టవు. అట్లే ఎన్నడును ఎరుగని వ్యక్తినిగూర్చిన సంకల్పములు మనస్సున పుట్ట నేరవు. జగములో ఏ వస్తువును చూడకగాని దేనిని గూర్చియు వినకగాని యుండినచో ప్రపంచమేయుండదు. ప్రపంచమనునదియే మనసున భాసింపకుండును. అనగా మనస్సు మిక్కిలి సంకుచితమై యుండును. తనయెరుక ఎంత వరకు వ్యాపించియుండునో అంతవరకే మనస్సు సంచరించుచుండును. అనుష్ఠానమును ప్రారంభించి మనస్సు తన కెరుకగల ప్రదేశములందు వ్యక్తులయందు, శత్రువనక, మిత్రుడనక, మలినమనక, శుద్ధమనక తిరుగుచు మరల మరల అనుష్ఠానమునకు వచ్చుచుండును. అనుష్ఠానమునకు రాకయే ఒక చోటనుండి మరొక చోటికి తిరుగుచుండుటయు గలదు. ఇట్లు తిరుగుచుండుటయు

ఆవశ్యకమే. ఏలయన యే యే స్థలములు, వస్తువులు, వ్యక్తులు మనస్సు యొక్క యెరుకలోనుండునో వాటి అన్నిటి సమిష్టియే మనస్సు. మనస్సుయొక్క ప్రసారమెంతవరకో అంతవరకు దీని పరిమితి.

అందువలన ఆ విషయములన్నియును శుద్ధమైనగాని మనస్సు పూర్ణముగా శుద్ధము కాజాలదు. మరి మనస్సు సత్కర్మానుష్ఠాన వేళ ఎక్కడకును పోకూడదన్న ఎట్లు సాధ్యమగును. ఒకానొక డేదైన నొకపని ప్రారంభించె ననుకొనుడు. అది ముగియకుండగనే అతడు గ్రామాంతరము నకు పోవలసివచ్చెను. అప్పుడాతడు తన కుమారునితో 'నాయనా! నేను వచ్చువరకును నీవీవనిని చేయుచుండుము' అని చెప్పిపోవును. తనపని మరొకరి కప్పగించి ఎక్కడకును పోకూడదను నియమము లేదుగదా. మనస్సు సత్కర్మాను ష్ఠాన మారంభించి ఇతర స్థలములకు తిరుగుచుండినప్పుడు ఈ సత్కర్మ నిలిచిపోయినదా? ఒక పురుషుడు సాకోరినుండి కోపర్‌గావునకు కాలినడకను పోవ ప్రయాణమాయెనను కొనుడు. అతడు కోపర్ గావు రోడ్డుపై నడువ మొదలిడెను. నడక వ్యాపారమునకు వలయు నిశ్చయమును, శక్తి మనస్సే యిచ్చినది. నడక మొదలైనతరువాత తాను సంచారమునకై బయలుదేరినది. ''కోపర్‌గావు పోవుచుంటిని. అక్కడ ఫలానా మనుష్యుడు దొరుకునా? దొరకడా? మనపని చేయునా? చేయడా?'' ఈ మొదలైనవెన్నో తలంపులు పరుగులెత్త సాగును. వీటివల్ల కాలియొక్కగతి నిలిచి

పోలేదు. అట్లే ఐనచో మనము మనస్సుతో "నీ విటునటు తిరుగుచుండుటవలన నా గతి మందగించి కోపర్‌గావు ఎప్పటికి వచ్చుటలేదు. నా పరిభ్రమణమూలమున నాలుగు మైళ్ళ దూరములోనున్న గ్రామము నూరు మైళ్లాయెను." అని మందలింపవచ్చును. వాస్తవమున నట్లు లేదుగదా. మనస్సు తిరుగుటవలన కాలిశక్తి తగ్గి గమన వ్యాపారము నిలిచిపోయినచో చిత్తము స్థిరమైనగాని యేపనియు చేయ సాధ్యముగాదు అని అంగీకరించియుండును. సత్కర్మ అంతరాయములేకుండ నడచుచున్నంతవరకు చిత్తస్థైర్యము యొక్క యావశ్యకతలేదు.

## 11 మనస్సు పరుగిడుటయొక్క ఆవశ్యకత- దానివలన లాభము.

చిత్తస్థైర్యమనునది సత్కర్మానుష్ఠానము యొక్క అంతిమఫలము. సత్కర్మలేకనే ముందే దాని ఫల మపేక్షించుటయా? చిత్తము స్థిరమైనచో పని పూర్తియైనదన్న మాట. ఇక సత్కర్మాచరణ ఎందుకు. సత్కర్మానుష్ఠానమందు మనస్సు ఎంత చంచలముగ నుండిన అంత చంచలతయు యావశ్యకము. అది ఎట్లన అనేక అపవిత్ర స్థలములకు పోవుచు వాటినన్నిటిని పవిత్రముచేయుటకు అనగా సదవస్థకు దెచ్చుటకు మనస్సొకచోట సత్కర్మానుష్ఠాన మార్గం

భించి పుణ్యశక్తిని ఉత్పన్నముచేయుచు దాని బలముచే ప
యే ప్రదేశములకు తిరుగుచుండునో యా యా ప్రదేశము
లను పావనము చేయుచుండును.

అనుష్ఠానకాలమున మన మనస్సు ఒక శత్రువునికడకు పోయినచో అనుష్ఠాన పుణ్యబలముచే వాని హృదయ మందలి వైరభావము క్షీణించి వాని యందలి శత్రుత్వబుద్ధి క్రమముగా నడంగును. వాని దుష్టత్వము మన మనస్సున స్ఫురింపచేయుటచే మన సత్కర్మయందు లీనమై అదియు సదవస్థను పొందును. ఇట్లు చాల కాలము సత్కర్మాచరణ నడపినచో దాని పుణ్యశక్తి మన శత్రువుల హృదయము లందు బ్రవేశించి వారియందలి శత్రుభావము నశించి సత్పరి ణామము కలిగితీరును. "మన మెవ్వరిని శత్రువుగా భావించుచుంటిమో వాడు మంచివాడుగా కనిపించు చున్నాడు. అతడు తన కాలమంతయును పుణ్యకర్మాచరణ మందే గడపుచుండెనని పెక్కండ్రు జెప్పుదురు. మనమాతని ద్వేషించి మనదోషమును వృద్ధిచేసికొనుట మంచిపనిగాదు" ఇట్లాలోచించి యతడు సద్బుద్ధి గలవాడగును. ఇట్లే సురా పానము చేయువాని మనస్సు అనుష్ఠానవేళ తన స్నేహి తులపై పోయినచో సత్కర్మ పుణ్యబలము వారి హృద యములందు పరివర్తన గలిగించి సద్విచార ముత్పన్నము చేయును. "మన మిత్రుడు సురాపానము మాని భగవ ధ్యానమునందు కాలము గడుపుచున్నాడు. మనముమాత్ర మింకను ఈ దురభ్యాసమునకు బానిసలమై యుంటిమి. ఇట్లు

ఏంతకాలము" ఇట్టియాలోచనలు కలుగగా ముందువారెప్పు డైనను దైవికముగా కలుసుకున్నచో యనుష్ఠాన మొనర్చు వాడు రెండవవానితో "మిత్రుడా! నేనిప్పుడు కల్లుత్రాగుట మానివేసితిని. దేవతారాధనయందే కాలము గడుపుచుంటిని. ఇదివరకు మనమిత్రిత్వమువలన నాకీశ్వరారాధనవలన కూడ నీపై మనస్సు పోవుచున్నది. ఇది అంత బాగుగలేదు. కాన నీవిక నా మిత్రత్వమును వదలవలెను. లేదా నా మిత్రిత్వ మభిలషించినచో కల్లుత్రాగుట మానవలెను." ఈ ప్రసంగమూలమున వానికిగూడ సిగ్గువచ్చి సత్కర్మానుష్ఠాన పుణ్యబల పరిణామముమూలమున వానికి సురాపాన వ్యసనబలము క్రమక్రిమముగా నశించును. ఇట్టి యనుభవములు లోకములో ఎన్నియో గలవు. ఇదేప్రికారము ఏ యే స్థలములు తనకు పరిచితములో ఆ యా స్థలము లన్నిటికి మంచి చెడ్డ భేదములేకుండ తిరుగుచు వాటిని పావన మొనర్చుచు తిరిగి యనుష్ఠానమునకు పోవుచు మనస్సు చిత్రగతుల మెలగుచుండును. ఇట్లపవిత్రిమగు యే యే వస్తువులపై నిలచుచు పుణ్యసంచయ మొనరించుచు తద్వార నానా స్థలములను పావనముజేయుచు మనస్సు ఆ స్థలములన్నియు పూర్ణముగా పవిత్రిములయినప్పుడు ఇక నా చోట్లకు పోవలసిన యావశ్యకత లేనందున తనంత తానే యుపశమించును. ఇది సహజముగ అనుభవమువల్ల గ్రహింపనగును.

## 12 ఒకవేశ్య యుదంతము

నా స్వానుభవములోని యొక యుదంతమును ఖా

కిప్పుడు చెప్పెదను. దానివలన మీకేమయిన యుపయోగ మున్నచో చూచుకొనుడు. నేను ఉమరావతి (బీరారు లోనిది)లో నున్నప్పుడు అక్కడొక వేశ్యయుండెడిది. దాని వృత్తి ననుసరించి ఆమెకడ కనేకతరగతుల మనుష్యులు వచ్చుచుండుటయు, తన్మూలమున యామె అప్పుడప్పుడు రోగపడుచుండుటయు గలదు. ఒకసారి ఆమె వ్యాధిపీడితయై యుండగా నాకు పరిచితుడును ఆమె విటులలో నొకడును నగు ఒక పెద్దమనిషి నన్నామెకడకు చికిత్సకై కొని పోయెను. నేనామెకు చెప్పవలసిన మాటలు చెప్పితిని. "నీకడకు పెక్కుమంది వచ్చుచుందురు. వారిలో పాపసంచ యముగలవా రనేకులుందురు. వారి పాపముల వలననే నీకిట్టి వ్యాధి కలిగినది. కాబట్టి ఔషధసేవ, పథ్యము సేయుటయేగాక పాపక్షయార్థమైన సత్కర్మాచరణ గూడ యత్యావశ్యకము. విధ్యుక్తముగ ఈశ్వర నియమము నీవు పాలించునెడల చెప్పెదను. రోగపీడితురాలగుటచేబాధ నివారణార్థమామె నేను చెప్పినదాని కంగీకరించి అట్లు చేయనారంభించెను. కొలది దినములలో వ్యాధి కుదిరెను. అయినను సత్కర్మాచరణ యభ్యాసమువలన దానియందభి రుచిగలిగి ఆమె తదనంతరముగూడ వీలయినంతకాలము ఏకాంతముగ పూజ, భజన, జపము మొదలగు సత్కర్మాను ష్ఠానమందు గడుపుచుండెడిది. అప్పుడప్పుడు నేనామెను కలుసుకొన్నప్పుడు పూర్వముకంటె ఆమె మనస్సు ఈశ్వరా రాధనమందు ఎక్కుడెక్కుడు తీవ్రత గలుగుటను చూచి

తిని. ఆమె నాతో ప్రసంగవశమున యిట్లు చెప్పుచుండెను. "నేను జపమునకుగాని ధ్యానము మొదలైన అనుష్ఠానమున కూర్చున్నప్పుడు నా మనస్సు నాకడకు వచ్చుచు పోవుచుండెడి విటులపై తిరుగుచుండును." నే నామెకు "మనస్సు పోయిన పోనీ, కాని ఈశ్వర సంబంధమగు సత్కర్మాచరణ నీవుమాత్రము విడువక పట్టుదలతో సాగించిన చాలును." అంటిని. ఆమె యిట్లనియె. "నేను విడచుటలేదు. మనస్సు గూడ నియమిత వేళకు అనుష్ఠానమందు కూర్చుండుట కుత్సహించుచున్నది. మిక్కిలి యుత్సాహముతో పరమేశ్వర మూర్తి యొక్క ధ్యాన మారంభింతునుగాని వెంటనే మనస్సు పరుగులుపెట్ట మొదలిడును. ఫలాన మనుష్యుడు ఇంకను నాడబ్బు ఇవ్వలేదు. వాని స్వభావము మంచిదిగా తోచదు. ఈమాదిరి తలంపులెన్నియో మనస్సున ఉప్పతిల్లును." నే నిట్లంటిని. "వాని దుష్టత్వము వాని మాలిన్య దుర్విపాకముపైకి మనస్సు పోయిన పోనీ, నీ సత్కర్మాచరణమాత్రము నీవు యథావిధిగా నిర్వర్తించుచుండుము. ఈ పుణ్యకర్మ నీకును: నీ మనస్సు నెవ్వరిపైకి పోవునో వారికినిగూడ ఉపయోగించును." దానివిటులు వేరు వేరుస్వభావముకలవారగుటచే వారిలో కొందరు దానిసత్కర్మాచరణను గురించి హేళనచేయ మొదలిడిరి. కాని ఆ సమయమున ఆమె మౌనము ధరించియుండుటచే నెవ్వరికిని యేవిధమైన సమాధానము చెప్పుచుండెడిదికాదు. కొందరామెను తిరస్కరించుచుండిరి. కొందరు సత్స్వభావముగలవారు అభినందించు

టయు గలదు. ఇట్లు కొన్ని దినములు గడచినతరువాత వారిలో కొందరికి సద్భావ ముత్పన్నము కాజొచ్చెను. "ఈ వేశ్య యీశ్వరారాధన ప్రవృత్తయై యున్నది. ఈమెకడకు మనము దుశ్చింతతో పోయి యీమెను పాపాచరణమునకు ఉన్ముఖురాలుగా జేయుట మంచిపనిగాదు. మనము స్వతః పుణ్యకర్మ మొనరించుటలేదు. అట్లు చేయుచున్న యీమెను పాపమార్గమునకు త్రిప్పుట యేమి మంచిపని." ఇట్లు వారు పాపచింతమాని పూర్వపు సహవాస బలమువలన ఆమె యింటికి ఊరక వచ్చిపోవుచుండిరి. కాలక్రమమున వారు గూడ ఆమె ననుసరించి ఈశ్వరారాధన తత్పరులైరి. ఇంత వరకు సంధ్య, పూజ యేమో యెరుగనివారుకూడ యీమె యుదాహరణనుబట్టి అవి మొదలిడిరి. ఇట్లు పెక్కండ్రు ఆమె సహవాసమువలన సన్మార్గ ప్రవర్తకులైరి. ఇంతవరకు వారి దుశ్చరితమువలన బాధపడుచుండిన వారి భార్యలు తమ భర్తల సత్ప్రవర్తనమునకు సంతసించిరి. మొదట యీమెను హేళనజేసి తిరస్కరించినవారుగూడ క్రమక్రమముగా అను ష్ఠాన సమయమున ఆమె మనస్సు వారినిగూర్చి చింతించుట చేత ఆ పుణ్య కర్మఫలితముగా వారి యంతఃకరణ వృత్తి కూడ మార్పునొంది వారు తమకు దేవతారాధన, భగవద్గీత పారాయణ మొదలగు పుణ్యకర్మలు చేయ నారంభించిరి. ఇప్పుడెవరైనను ఆమె యింటికి వచ్చినచో భగవత్ప్రాణా ర్థమే వచ్చుచుండిరి. ఆమెయింటి కిదివరకుండిన నికృష్టత్వము పాపత్వము, తొలగి పూజ్యత యేర్పడెను. ఆమె పూర్వపు

విటులు "నీవు మాకిప్పుడు మాతృసమానురాలవు. నీ మూలమున మేము ఈశ్వరారాధమునకు గడంగితిమి." అని అనుచుండిరి. ఆమె పూర్వపు వేషభాషలను, ఆడంబరమును వదలి స్వచ్ఛమైన ధౌతవస్త్రము ధరించి సంసార స్త్రీల వలె మెలగుచుండుట జూచి యితరులు సిగ్గుతెచ్చుకొని తమ ప్రవర్తనను పూర్తిగా మార్పుజేసుకొనగల్గిరి. ఇదొక కల్పితకథ కాదు. నా ప్రత్యక్షానుభవములోని ఉదాహరణ.

ఇట్లనుష్ఠాన సమయమున మనస్సు ఎచ్చటెచ్చటికి తిరుగునో ఆయా చోట్ల ఆ పుణ్యకర్మ బలముచే పవిత్రి మొనర్చుచుండును. మనస్సు పరిభ్రమించుటవలన కలుగు లాభము ఎవ్వరికిని తెలియుటలేదు. అనుష్ఠానమునందు మనస్సు తన యెరుకలోనున్న ప్రదేశమునకు వందలకొలది మైళ్ళ దూరమున్నను పోవుచుండుటచే అంతదూరముననున్న స్థలమునుగూడ పావనము చేయగల్గుచున్నది. అనుష్ఠాన కాలమున మనస్సు పరలోకమునకేగిన పితృదేవతలనుగాని బంధుమిత్రులనుగాని స్మరించుటగాని వారికి హితమైన ఏదైన విచారము నెఱపినగాని వారందరును శుద్ధులై సద్గతి నొందుదురు. కనుకనే శాస్త్రములయందు చిత్తశుద్ధికొరకు సత్కర్మాచరణము విధింపబడినది. మనస్సు పూర్తిగా శుద్ధి కావలసినచో దానిలో కొంతభాగమును నిర్మలమొనర్చి మరి కొంతభాగమును మలినభూయిష్టముగా నుంచిన ప్రయోజనములేదు. మురికిబట్టిన మన శరీరమును స్నానముచేసి

తోమి స్వచ్ఛము చేయవలసినచో శరీరమందలి కొన్ని యవ యవములను మాత్రము తోమి కడిగి మిగిలిన దేహ మట్లే యుంచినచో శరీరమంతయు శుభ్రము కానేరదు. శరీర మందలి యవయవము లన్నిటిని ప్రత్యేకముగా కడుగవలసి యుండును. అట్లే మనస్సు పూర్ణముగా స్వచ్ఛముగా కావలసినచో మనస్సుయొక్క వేరు వేరంగములన్నియు పరి శుద్ధి నొందవలెను. "మనస్సు శిరమునగాని హృదయమున గాని ఉన్నదిగదా. దీనిని స్వచ్ఛముచేయుట ఎంత సత్కర్మ కావలసియుండునో" అని కొందరకు సందేహము కలుగ వచ్చును. చిన్న బిడ్డకు స్నానమునకు నీరు ఒకచెంబె చాలును. భోజనమును స్వల్పముగనే కావలసియుండును. కాని యీ బిడ్డ యెదిగి పెద్దవాడయిన తరువాత. స్నానమునకు లచా నీరు కావలెను. భోజనమునకు అన్నము, రొట్టె, కూర మొదలగు పదార్థములెన్నియో కావలెను. ఇదేరీతిని మనస్సు చిన్నదిగా నున్నచో దానిని శుద్ధి చేయుటకు కొంచెము సత్కర్మ చాలును. కాని మొదట మనస్సు చిన్న దిగా నున్నను మీరు దానిని పెంచి ఎంతో పెద్దదానిని చేసి నారు. శరీరమున కనేక అవయవము లెట్లున్నవో అట్లే మనస్సునకుగూడ పెక్కంగము లమర్చి వాట్లన్నిటిని అనేక విధముల పెంపొందించి పెద్దదిగ జేసితిరి. దానియొక్క అవ యవములేవనిన? ఎక్కడెక్కడికి మనస్సు పరుగులిడునో ఆయా స్థలములన్నియు మనస్సుయొక్క అంగములే. ఏదైన ప్రదేశముగాని, వస్తువుగాని, వ్యక్తిగాని వందలకొలది మైళ్ల

దూరముననున్నను వాటితో మనస్సునకు మంచిదిగాని చెడ్డది గాని సంబంధమున్నచో ఆ స్థలముగాని, వ్యక్తిగాని మనస్సు యొక్క అవయవమే యగును. ఇది మీ మనస్సుయొక్క పెద్దతనము (వ్యాపకత్వము) యొక్క పరిమాణము. మీ మనస్సు ఒక శత్రువునిగూర్చి మంచి చెడ్డ విచారమేదైనను చేయుచుండినచో ఆ శత్రువుకూడ మీ మనస్సుయొక్క భాగమే యగును. అందువలన ఆ శత్రువునెడ నుండెడి మాలిన్యము పోగొట్టుటకై మనస్సు ఉపాయమును వెదకు చుండును. ఆ శత్రువు శారీరకముగా ద్వేష బుద్ధితో ఏ వ్యాపారము మీయెడల చేయునో అది చేయకుండుటకును మీయెడల ద్వేషబుద్ధి తగ్గుటకును మీరుకూడ అజ్ఞానము వలన ద్వేషబుద్ధితో ప్రతిక్రియ చేయుచుందురు. మరికొందరు శత్రువుల ద్వేషబుద్ధిని తగ్గించుటకు తాము శాంతముగా నుండుటయే యుపాయమని నెంతురు. ఏ వ్యక్తియందు మీ యెడల శత్రుత్వబుద్ధి గలదో ఆ వ్యక్తి చెడ్డవాడగుటచే అతనికి మీ మనస్సుతో సంబంధము లేదనుకొనగూడదు. వాని పర్యంతము మీ మనస్సు వ్యాపించియే యున్నది. మీ గుదద్వారము మలభూయిష్టమైన దగుటచే అది మీ యవ యవము కాదని కాని మీ శరీరమంతవరకు వ్యాపించియుండ లేదనిగాని యెవ్వరైన చెప్పుదురా? ఎట్లు మలినమైన గుద ద్వారమును స్వచ్ఛమొనర్చుటకు శ్రద్ధతో పనిచేయుదురో అట్లే తెలివిగల మనస్సు తన యవయవములను నానా ప్రదే

శములందు వ్యాపించిన మలినభాగములను శాస్త్రపద్ధతి ననుసరించి నానావిధములగు చిన్న పెద్ద సత్కర్మల ననుష్ఠించి తత్పుణ్యమూలమున ఆయా భాగములను శుద్ధ మొనర్చుచుండును. ఇట్లెంతవరకు మనస్సు వ్యాపించినదో అంత ప్రదేశమును స్వచ్ఛమైనయెడల ఇక మనస్సుయొక్క వ్యాపారము నిల్చిపోవును. అనగా ఆయాసము నొందినవాని వలె తన వ్యాపకత్వమును వదలి సంకుచితమగును. మీ శరీరములో అవయవములన్నియు మీవిగా భావింపబడుటచే వాటిలో ఏ భాగమందైనను ఏదైన నొక స్పర్శ కలిగినచో అది యేదో, మెట్టిదో, మంచిదో, చెడ్డదో, చీమకుట్టుట మొదలగు ప్రతికూల స్పర్శయో, లేక సుఖదాయకమగు అనుకూల స్పర్శయో మీ కెట్లు తెలియునో అట్లే సత్కర్మ ఆచరించువారికి వారి మనస్సు ఏ యే వ్యక్తులనుగురించి అనుష్ఠానకాలమున చింతించుచుండునో ఆ యా వ్యక్తుల వ్యాపారము లన్నియు మనస్సు శుద్ధినొందినతరువాత వారికి గోచరించును. ఇట్లనుష్ఠానము నడచుచున్నంతకాలము ఎందరో వ్యక్తులను పునీతుల గావించి అనుష్ఠానము పూర్తియైన పిమ్మట దేహ పతనాంతరము సద్గతిని పొందును. ఏ యే వ్యక్తులీతని మనస్సున కంగభూతులై యుండిరో వారందరునుగూడ మరణానంతరము ఆతడు పొందిన స్థానమునే **పొందుదురు.**

# 13 అసద్బుద్ధి యెట్లుపశమించును?

మన బుద్ధి అసద్రూపమును యేల (మాలిన్యము) పొందెను? అది శుద్ధమొనర్చుటకు సత్కర్మ యేల కావలెను?'' అని కొందరకు సందేహము కలుగవచ్చును. ప్రప్రథమమున సద్వస్తువు ఒకటియే యుండెను. దానిపై అసద్వస్తువుయొక్క ఆరోపణ కలిగెను. ఈ అసద్వస్తువు యందే మన యుత్పత్తి. కాన అసద్వస్తువుయొక్క గుణ ధర్మములు మనయందు అనగా మన మనస్సులయం దుండియే తీరును. సద్వస్తువుయొక్క ఆధారమువల్లనే అసద్వస్తువు యొక్క ఉనికి యగుటచే మనయందు సద్వస్తువుయొక్క లక్షణములు కలవు. అసద్వస్తు గుణధర్మములవలన అపరిశుద్ధమైన మన మనస్సును అసద్వస్తువుచేత స్వచ్ఛము చేయ గలిగినచో నట్లు చేయవచ్చును. కాని యీ శుద్ధికి వ్యతిరేక గుణధర్మములుగల సద్వస్తుసహాయ మవసరము. కాని యీ అసద్వస్తువును మరియొక సద్వస్తువుచే శుద్ధిచేయవలెనన్నచో ఆ రెండవ అసద్వస్తువునందు సదంశ అధికముగా నుండిన గాని సాధ్యముగాదు. ఈ సదంశయొక్క బలముననే యీ అసద్వస్తువునకు మాలిన్యమును పోగొట్టు శక్తి కలిగినది. ఈ విషయము కొంచెము కఠినమైనది. అయినను సూక్ష్మ బుద్ధితో శ్రద్ధగా పరిశీలించినచో సులభముగానే తెలియ గలదు. ఈ అసద్వస్తువును నాశనమొనరించి సదవస్థకు కొని పోవుట కే క్రియ చేయబడునో యది సత్క్రియ యనబడును.

కాని సద్వస్తువు తనంత తాను అసద్వస్తు నాశనమునకు ప్రవృత్తి కలదికాదు. ఏలయన అది సహజముగా నిష్క్రియావస్థయం దుండును. కాబట్టి సత్కర్మ నాచరించువారు అసద్వస్తు నాశనమునకు అసద్వస్తు యాధారముననే సద్వస్తువు యొక్క శక్తి సంగ్రహింప యత్నింతురు. ఒక మలిన వస్త్రము శుభ్రము చేయవలసినచో ఒక భాండమున జలము తీసుకొనవలయును. బట్ట మురికియు భాండమునుగూడ యసద్వస్తువులేగాని బట్టమరికి యను అసద్వస్తువును నాశనమొనర్చుటకు భాండము నెడల యసద్వస్తువుద్వార జలరూపమగు సద్వస్తువును గ్రహింప నవసరము. సద్వస్తు వేకరూపముననే ఉండును. అసద్వస్తువు నానారూపము లుండును. సద్వస్తువు తనంత తాను ఏమియు పనిచేయదు. ఆ దేప్రకారము దీపము సూర్యనారాయణ యసద్రూపులైనను చీకటి యను యసద్వస్తువును పోగొట్టుటకు తగిన సద్వస్తువు బలమును యివ్వగల వగుటచే ఆ యసద్వస్తువును నాశన మొనరించు చున్నారు. కాబట్టి యొక యసద్వస్తువు నశింపజేయుటకు వేరొక యసద్వస్తువుద్వార సద్వస్తు సంగ్రహమును జేయవలెను. ఈ సంగ్రహమునకే సత్కర్మాచరణ మందురు. సత్కర్మ యొక్క బలము వృద్ధియైనకొలది సచ్ఛక్తి అసద్వస్తువునందు ప్రవేశించి దాని నాశన మొనరించును. ఇదియే సత్కర్మ యొక్క మహిమ. ఇట్లు నిశ్చయబుద్ధితో రామనామస్మరణకాని మరేదైన యనుష్ఠానరూపమగు యసద్వస్తు సహాయమున సద్వస్తువుయొక్క శక్తి నుత్పన్నముచేసి దాని

మూలమున మనస్సురూపమగు అసద్వస్తు వెంతవరకు వ్యాపించినదో అంతవరకు సద్రూపముగా నొనర్చినచో అప్పుడు సత్కర్మరూపమగు అనుష్ఠానమను అసద్వస్తువు యొక్క వసరముండదు. అనగా రామనామస్మరణ చేయ నవసరములేదు. అనుష్ఠానమాచరించు కర్త సత్కర్మమూల మున రామునితో (సద్రూపముతో) ఐక్యమొందినపుడు ఇక రామస్మరణ ప్రయోజనమేమి. ఇంతియేగాక యితడు సబ్బువలె లేక దీపమువలె లేదా సూర్యునివలె నితరుల యొక్క మనోమలమును పోగొట్టుటకు తగిన సామర్థ్యము కలవాడగును. తానఖండానందముయొక్క (సదవస్థయొక్క) అనుభవము కలిగియుండుటయేగాక యితరులను నట్టి స్థితికి కొనిపో సమర్థుడగును.

## 14 అశౌచమందు అనుష్ఠానము ఎట్లు పాటింపవలెను

భక్తులలో నొకడు "అశౌచములో నున్నపుడను ష్ఠానమొనరించుటెట్లని" ప్రశ్నించగా బాబా యిట్లు చెప్ప దొడంగెను. "ఇంతవరకు నేను చెప్పినదంయు వినినపిమ్మట కూడ సందేహము కలిగినదా?" అశౌచమనునది అనుష్ఠా నమునకు ఒక విఘ్నమన్నమాట. విఘ్నములను గణనచేయ కుండుటేగదా అనుష్ఠానముయొక్క ముఖ్య నియమము. కొంచెము విమర్శించి చూచినచో అనుష్ఠాన మాచరించుటకు

అశౌచము మొదలైన ఆటంకములు లెక్కచేయరాదు. వాస్త వమున మనము విఘ్నము లనుకొన్నవి విఘ్నములు కానే కావు. మన మనస్సునకంత నిశ్చయము లేకపోవుటచే అవి యాటంకములుగా నెంతుము. అశౌచమం దపవిత్రముగా నుందుమని మీ యుద్దేశ్యము. మరియు నిట్టి స్థితిలో పవిత్ర కార్యముల నెట్లు చేయనగునని మీ సందేహము. కాని యదార్థమునకు మనము భగవంతున కర్పణముచేసిన కాలము నందు వ్యవహార విషయములేమియు అడ్డురాజాలవు. ఒక వస్త్రము దానమిచ్చినచో మిగిలిన మన బట్టలన్నియు మయిలపడినను దానమివ్వబడిన బట్టకు మనమయిల సోకదు గదా' అట్లే ఈశ్వర దత్తమైన కాలమునకు వ్యవహార సంబంధమైన మైల యెట్లు సోకును. అదియునుగాక అనుష్ఠాన రూపమగు ఏ సత్కర్మ ప్రారంభింపబడినదో అది సమస్త దోషములను అపరిశుద్ధతను పోగొట్టుటకేకదా. అట్టియెడ అనుష్ఠానమందు అశౌచము వచ్చినదన్నమాట కర్థమేమి. లోకరీత్యా మీ కుటుంబమందు ఎవరైనను మృతినొందినచో ఆ కుటుంబమున కంతకను అపవిత్రత కలిగినట్లు ఎన్నబడు చున్నది. మీరు నియమితకాలమున యథావిధిగా అనుష్ఠాన మొనర్చినచో ఆ సత్కర్మయొక్క బలమువలన ఆ మృతజీవి సద్గతికి పోవును. అటుగాక అశౌచమును విఘ్నముగా నెంచి అనుష్ఠానమును మానినచో ఆ మృతజీవియొక్క మాలిన్య మట్లే ఉండిపోవును. మీకింతవరకు మనోనిశ్చయములేక

అపవిత్ర స్థితియం దున్నట్లు పరిగణించినచో అనుష్ఠానము ను ఆ దినములలో నిలిపివేయుడు. ఆ యనుష్ఠానకాలమున మాత్రము లోకవ్యవహారమేమియును చేయరాదు. ఆ కాలమట్లే నిర్వ్యాపారముగా నుండనిండు. ఆవేళ గృహకృత్యములు మొదలగు లౌకికకర్మ లాచరించినచో ప్రయోజనము లేదు. పరమేశ్వరప్రీత్యర్థ మేకాల మర్పింపబడినదో ఆ వేళ మీలో నెవ్వరైనను మృతినొందినను ప్రేతకర్మకు మరియొక డుండినచో మీరు మీ అనుష్ఠానమును విడువగూడదు. తప్పనిసరియై మీరే నిర్వర్తింపవలసినచో ఆ మృతజీవికి తప్పక సద్గతి కల్గును. అనుష్ఠానకాలమున మీరొక ఆసన్న మరణుడగు రోగివద్ద కూర్చుండి శుశ్రూష చేయవలసి వచ్చినచో ఆ రోగియొక్క బాధ ఉపశమించుననుట నిస్సందేహము. లేదా మృతినొందినచో వాడు సద్గతి నొందుననుట నిర్వివాదాంశము.

## 15 వ్యాధికాలమున అనుష్ఠాన మొనర్చుటెట్లు

ఒకానొకప్పుడు శరీరము వ్యాధిగ్రస్తమై యనుష్ఠాన మొనరించుట సాధ్యముకానిచో ఆవేళ మరియొక వ్యాపారమునకు వినియోగించక వ్యాధి బాధను అనుభవించుచు ఈశ్వరస్మరణ చేయుచుండినచో ఆ కష్టానుభవ సహాయమున కార్యము శీఘ్రముగా నెరవేరును. కాని బాధ నివారణకును శరీరసుఖమునకును ఉపచారములు చేయుచు ఆ కాలమును

వ్యయపరచినచో దోషముకలుగును. ఆ కాలమునమాత్రము అనుష్ఠానమున కేర్పాటుచేసికొనిన స్థలముయొక్కయు ఇష్ట దేవతయొక్కయు స్మరణచేయుచు బాధ ననుభవించి నియమితకాలానంతరము ఇచ్చవచ్చిన చికిత్స చేయించుకొనవచ్చును. ముఖ్యముగా గమనించవలసిన విషయమేమన భగవంతున కర్పింపబడినవేళ యాలుబిడ్డలనుగూర్చిగాని ఇతర సాంసారిక విషయములనుగూర్చిగాని ఖర్చుపెట్టగూడదు. ఆకాలము నట్లే నియమితముగా నుంచవలెను. ఒక వేళ యీ సమయముననే మరణము ప్రాప్తించినచో యనుష్ఠానము సిద్ధించినదన్నమాట. పై చెప్పబడిన యనుష్ఠానము విధ్యుక్తముగా జీవితకాలమంతయు నెరపినచో తత్ పుణ్యబలమువలన మరణముకూడ ఆ కాలముననే ప్రాప్తించును. సారాంశము పరమేశ్వర సత్కార్మ కేర్పాటుచేయబడిన పుణ్యకాల మేదైన యాటంకమువలన నియమితప్రకారము వినియోగింప వీలుగానిచో నితర లౌకిక వ్యాపారములకు వ్యయపరుపక అట్లే రిక్తాముగా ఉంచవలెను. గ్రామాంతరము పోవలసివచ్చినచో నియమితస్థలము వెంట రానప్పటికిని, కాలము, ఇష్టదైవమును మీ వెనువెంబడియే యున్నారు కదా. వాటినిగూడ నింటివద్ద వదలి మీరూరికి పోవుటలేదు. పరస్థలమందున్నను నియమితకాలమును ఇతర వ్యాపారముల కుపయోగించక యేర్పరచుకొన్న యనుష్ఠానమునే నిర్వర్తింపవలయును. పరిస్థితుల వ్యత్యాసమువలన నియమితస్థలమేగాక నియమితకాలముగూడ మనస్వాధీనమం

దుండకపోయినచో అప్పుడుకూడ దినమందలి ఇరువది నాలుగు గంటలలో నెప్పుడైన నొకప్పుడు ఆ సత్కర్మ యాచరించినచో నుత్తమము. కాని యిది రెండవతరగతిలో చేరిన యనుష్ఠాన మనబడును. నియమితకాలమునకు జరుప బడ నప్పటికిని సత్కర్మ నిష్ఫలము కానేరదు. అసలు చేయ కుండ మానుటకంటె దినములో నేదో ఒకవేళ చేయుట మేలే. దినములో ఏదో ఒకవేళ నమస్కారములు ఇత్యాది నియమిత సత్కర్మ పూర్తి చేసిగాని భోజనము చేయగూడదను నట్టి నీమముకూడ మంచిదే. కాని యిది పై జెప్పబడిన యనుష్ఠాన వ్యాఖ్యానమునకు నిలబడదు.

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

సంపూర్ణము.

26919
3.3.73.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 22 | పరమాత్క | పరమాత్మ |
| 4 | 23 | యాక్షేణ | యాక్షేపణ |
| 6 | 8 | తెలిసినుకొోట | తెలిసికొనుట |
| 8 | 14 | వచ్చియుందురు | వచ్చియుండరు |
| 11 | 14 | ఉపసించి | ఉపవసించి |
| 13 | 3 | ఆనందమునత | ఆనందమునకు |
| " | 13 | ఆను | ఆస |
| 14 | 6 | వెంచుకొని | వైచుకొని |
| 15 | 2 | ఇక్కడ | ఇరువది |
| " | 6 | ఈర్వరున | ఈశ్వరున |
| 18 | 11 | యవ | యన |
| " | 21 | మనలను మామూలు | మనలను పూర్వస్థితికి దెచ్చు నిట్టి గొప్ప విఘ్నములను మామూలు |
| 19 | 15 | మిడును | మిడెను |
| 22 | 13 | ద్విజులను | ద్విజులకు |
| " | 21 | భగవంతుము | భగవంతుడు |
| 23 | 13 | వర్ధించుట | మడిగా వండుట వర్ధించుట |
| 25 | 7 | పరిణానుము | పరిణామము |
| 33 | 3 | ఉత్పన్నము | ఉత్పన్నము |
| " | 10 | గూర్చిన | గూర్చిన |
| 34 | 11 | వనిని | పనిని |
| 35 | 3 | నా | నీ |
| 37 | 5 | ఈశ్వరారాధన | ఈశ్వరారాధన |
| " | | వలన | కాలమున |
| 42 | 12 | లచా | చాల |
| 46 | 8 | మరికి | మురికి |
| " | 9 | భాండమునెడల | భాండమునెడి |
| 43 | 8 | వ్యవశార | వ్యవహార |
| " | 17 | కంతకను | కంతకును |